LONGEST LIVING NEWSPAPER IN TELUGU JOURNALISM

Visit Internet Edition @ www.zaminryot.com

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు | సంపుటి : 71 | సంచిక : 38 | 22.9.2000 శుక్రవారం | 12 పేజీలు | విడిప్రతి : రూ.2.00లు | జీవప్రదాత : నెల్లూరు శ్రీరామమూర్తి



# బ్యాలెట్‌పైనే కరెంట్ బుల్లెట్‌గురి

శాసన సభా సమావేశాలలో విద్యుత్ సమస్య సమసిపోయినట్లా? లేక మరింత ఉధృతంగా జన హృదయాలలో ప్రవేశించినట్లా? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పవలసింది అంతిమంగా ప్రజలే. కాని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు మాత్రం మహదానందంగా వున్నాడు. శాసనసభలోనే విద్యుత్ ఆందోళన సైతం నీరుగారి పోయిందని, ప్రతిపక్షం పైన తాము గెలుపు సాధించామని సంబరంగా చెప్పుకుంటున్నాడు. కాంగ్రెస్, కమ్యూనిస్టులు ఎంత ఆగం సృష్టించినా తన చేత ఛార్జీలు తగ్గించలేక పోయారన్నది ముఖ్యమంత్రి అభిప్రాయం. శాసనసభను స్తంభింప చేస్తామని ప్రగల్భాలు పల్కిన కాంగ్రెస్ నేతలను తాము సమర్థవంతంగా నిరోధించామన్నది ఆయన సంతోషం. నిజమే ఏకబిగిన 17 రోజులపాటు అసెంబ్లీని అటకాయించినా చంద్రబాబు ఛార్జీలు తగ్గించలేదు; 90మంది ఎమ్మెల్యేలు నిరాహార దీక్ష చేపట్టినా చలించలేదు; వెలాదిగా తరలివచ్చి నిరసన తెల్పిన జనాన్ని పోలీసు తుపాకులతో పిట్టల్ని కాల్చినట్లు కాల్చిపారేశాడు తప్ప, భయపడలేదు. తన చేతుల కంటిన రక్తపు మరకల మాలిన్యాన్ని న్యాయ విచారణతో శుభ్రం చేసుకోవాలని కోరిన కోరికనూ తీర్చలేదు. ప్రతిపక్షం కోరిన ఏ కోరికనూ తాను తీర్చలేదు. కాబట్టి తనే పైచేయి అంటున్నాడాయన.

## కసితో రగులుతున్న ఆంధ్ర ప్రజానీకం

అధికారమదంతో కళ్లు పొరలు క్రమ్మిన వారికి కళ్లెదుట కన్పించేది తాము సృష్టించుకున్న భ్రమల రూపమే తప్ప, నిజ స్వరూపం గోచరం కాకపోవడంలో విచిత్రం ఏమివుంది? "ఫూల్స్ ప్యారడైజ్" అంటే ఇదే!

ప్రజాస్వామ్యంలో ఏ ఉద్యమానికైనా అంతిమ లక్ష్యాలు రెండు - ప్రజలను చైతన్యం చేయడం మొదటిది; ప్రభుత్వపు మెడలు వంచడం రెండవది. ప్రపంచ బ్యాంకు షరతుల ప్రకారమే ధరలు పెంచారని; అప్పుకోసం రాష్ట్రాన్ని తాకట్టు పెట్టారని; ధరల పెంపకం ఇంతటితో ఆగదు, మరి మూడు సంవత్సరాల పాటు వరుసగా పెరగక తప్పదు అని జనానికి అర్థమయ్యేట్లు చేయడంలో ప్రతిపక్షాలు సఫలం చెందాయి శాసనసభలో! విద్యుత్ సంస్కరణలు తన స్వంత సృష్టి అని ఇంతకాలం డబ్బా వాయించుకొంటుండిన ముఖ్యమంత్రి మాటలు; సంస్కరణలతో ఛార్జీలు పెరగవు అని ఆయన చేసిన వాగ్దానాలు ఎంత కపటమైనవో ప్రజలు తెలుసుకున్నారు. 80 రోజుల పాటు ధర్నాలు, నిరసనల ద్వారా చేయలేని ఈ పనిని 17 రోజుల విద్యుత్ చర్చలో సాధించింది ప్రతిపక్షం. వార్తా పత్రికలు చదవడం రాని అమాయక పల్లెటూరి జనం సైతం రాష్ట్ర ప్రభుత్వ మోసాన్ని గ్రహించారు. ఏ ఉద్యమానికైనా అంతకంటె సాఫల్యం ఏమి వుంటుంది? సభలో మెజారిటీ వుంది కాబట్టి చంద్రబాబు ప్రతిపక్షం నోరు

తరువ 7వ పేజీలో

# తెలుగు సిగలో ఆభరణం కరణం

తెలుగింటి ఆడపడుచు కరణం మల్లేశ్వరి ప్రతి తెలుగింటా పండుగ ఉత్సాహం వెల్లి విరియింపజేసింది. తెలుగు జాతి ఖ్యాతి ప్రపంచమంతా తేజరిల్లేట్లు చేసింది సిడ్నీ ఒలింపిక్స్‌లో ఆ యువతి సాధించిన కాంస్య పతకం - యావత్ భారత ప్రజానీకానికి లభించిన ఆత్మబల సంకేతం. ఒలింపిక్స్ వంటి అంతర్జాతీయ క్రీడలలో గెలుపు నందుకొనే సామర్థ్యం భారతీయులకు లేదు. మన ఆహారపుటలవాట్లు, శరీర నిర్మాణం, జన్యుపర దోషాలు అందుకు కారణమని ఒక దురభిప్రాయం వ్యాప్తిలో వుండేది ఇంతకాలం. దాన్ని పటాపంచలు చేసింది మల్లేశ్వరి.

ఆమె అచ్చమైన ఆంధ్ర ఆడపడుచు; అతి పేద కుటుంబీకురాలు. తండ్రి - రైల్వేలలో ఒక కానిస్టేబిల్ మాత్రమే. అంతర్జాతీయ క్రీడలకు అవసరమైన వాతావరణం, శిక్షణా వసతులు, ఆర్థిక సంపత్తి, మార్గదర్శకులు లేకుండానే - శ్రీకాకుళం జిల్లా ఆముదాలవలస గ్రామంలో, ఒక చిన్న వ్యాయామశాలలో బరువులెత్తడం నేర్చుకున్నది మల్లేశ్వరి. జాతీయ స్థాయిలో



అవార్డులు గెల్చుకున్నంత వరకు ఆమెను ఎవరూ పట్టించుకోలేదు. ప్రపంచ ఛాంపియన్‌గా గెల్చినా కేంద్ర క్రీడల శాఖ ఆమెను ఒలింపిక్స్‌కు పంపడానికి

తరువ 7వ పేజీలో

# తేజ టి.వి. పుణ్యం-శాసనసభ తేజం

చరిత్రలో మొదటిసారిగా ఆసక్తి కలిగిన రాష్ట్ర ప్రజలందరూ శాసన సభా సమావేశాలు జరిగే తీరు ఎట్లా వుంటుందో ప్రత్యక్షంగా చూశారు. తేజ టివి పుణ్యం అది. ప్రభుత్వం వారికి ఎన్ని ఆటంకాలు కల్పించినా, ప్రత్యక్ష ప్రసారానికి నిరాకరించినా - రికార్డెడ్ క్యాసెట్లను ప్రసారం చేసి రాష్ట్ర ప్రజలకు ఎంతో మేలు చేసింది తేజ టి.వి. టెలివిజన్ ప్రసారాలలో ప్రతి సెకండు విలువైనదే. అందులో ప్రకటన ఇవ్వడానికి సెకండుకు 300 నుండి రెండు వేల రూపాయల వరకు తీసుకుంటారు. అటువంటిది నెలకు పైబడి, ప్రతిరోజూ 6 నుంచి 13 గంటల వరకు నిరంతరాయంగా తమ టివి సమయం మొత్తాన్ని అసెంబ్లీకి ఉచితంగా కేటాయించిన 'తేజ' యాజమాన్యాన్ని అభినందించాలి.

ఇప్పటి వరకు అసెంబ్లీ చాలా కొద్ది మందికి పరిమితం. లోపలకు వెళ్లడానికి పాస్ దొరకడం దుర్లభం. ఒకవేళ దొరికినా గ్యాలరీలో ఖైదీల వలె గడపాలి. తమ ఎమ్మెల్యేలు ఎట్లా మాట్లాడుతారు, ఏమి మాట్లాడుతారు; ప్రభుత్వం, మంత్రులు చెప్పే సమాధానాలు ఏ తీరులో వుంటాయి అన్న వివరం ప్రజలకు అంతుపట్టేది కాదు. పత్రికలలో వచ్చే వార్తలు - నూటికి పది శాతం కూడా వుండవు. ప్రత్యక్ష టెలివిజన్ ప్రసారాలతో ప్రజలకు ఆ

## లైవ్ టెలికాస్ట్ అయితే మరీ రంజుగా వుంటుంది

సమాచారం కొరత తీరిపోయింది. జనం తమను చూస్తున్నారనే భయంతో ఎమ్మెల్యేలు సైతం బాధ్యతాయుతంగా వ్యవహరించక తప్పదు.

ఇది వరకు ఎమ్మెల్యేలు తమ నోటికి వచ్చినట్లు మాట్లాడేవారు. ఆ తర్వాత స్పీకర్ ఆ మాటలు రికార్డులలో నుంచి తొలగించే వారు. వారేమి వాగింది జనానికి తెలిసేది కాదు. ఇప్పుడా ఛాన్సు లేదు. రికార్డులలో నుంచి తొలగించే పద్ధతి ఇక కేవలం లాంఛన ప్రాయమే. అయితే ఈ ప్రత్యక్ష ప్రసారాలతో ఒక సమస్య వచ్చి పడింది. టివి కెమరా వైపు చూస్తూ మంత్రులు, ఎమ్మెల్యేలు, చివరకు ముఖ్యమంత్రి కూడా అనవసరంగా మహోపన్యాసాలు దంచుతున్నారు. శాసనసభను పబ్లిక్ మీటింగ్ వలె మార్చిపారేస్తున్నారు. శాసనసభా సాంప్రదాయాలకు విరుద్ధం అది. సభలోపల విధానాల ప్రకటన, శాసనాలపై చర్చ, ప్రశ్నలు - జవాబులు తప్ప ఉపన్యాసాలు చేయకూడదు. రాష్ట్ర మంతటా తమ మాటలు విన్పించే అవకాశం మళ్లీ రాదని మైకు ముందు నిలబడి ఉదరగొడితే శాసన సభ సమయం వృధా అయిపోతుంది. ఈ ఒక్క స్వల్ప చికాకు తప్ప ప్రత్యక్ష ప్రసారాలు ప్రజలకు చాలా ఉపయుక్తంగా వున్నాయి. ప్రభుత్వం ఇది గుర్తించి తదుపరి సమావేశాలకైనా లైవ్ టెలికాస్టింగ్‌కు అనుమతి ఇవ్వడం సమంజసం.

# వై.ఎస్., ఓవైసీ-శభాష్

ఈ శాసనసభా సమావేశాలు రాష్ట్రానికి ఇద్దరు సమర్థులైన పార్లమెంటేరియన్లను అందించాయి. వారు - సిఎల్‌పి నాయకుడు డాక్టర్ వైఎస్. రాజశేఖరరెడ్డి; మజ్లిస్ పార్టీ నేత అసదుద్దీన్ ఒవైసీ!

రాష్ట్ర రాజకీయాలలో దుందుడుకుతనానికి, ఆవేశానికి పర్యాయపదంగా రాజశేఖరరెడ్డిని పేర్కొనేవారింత కాలం. తన మనసులో కలిగిన అభిప్రాయాలను కుండబ్రద్దలు కొట్టినట్లు చెప్పడం తప్ప; వెనకా ముందు ఆలోచించక పోవడం ఆయన తత్వం. అందువల్లనే ఆయన కాంగ్రెస్ అధికారంలో వున్నా, ప్రతిపక్షంలో వున్నా వివాదాలకు కేంద్రబిందువుగా వుంటాడు. కాని ఈ సమావేశాలలో రాజశేఖరరెడ్డి రూపమే మారిపోయింది. ఆవేశమంటే ఏమిటో తెలియని వాడివలె; నిందారోపణలు తను నేర్వని వాడివలె; తొందరపాటుతనం తన దరిచేరనివ్వని వాడివలె - ఎంతో సహనంతో, నిగ్రహంతో వ్యూహచతురతతో వ్యవహరించాడు.

విద్యుత్ సమస్య, బషీర్ బాగ్ పోలీసు కాల్పులు, ప్రపంచ బ్యాంకు షరతులు, ఐఎఎస్ అధికార్ల అవినీతి, కాలం చెల్లిన ఆర్డినెన్స్‌ల ప్రయోగం వంటి కీలక అంశాలలో రాజశేఖరరెడ్డి కాంగ్రెస్‌పార్టీని అత్యంత బాధ్యతాయుతంగా నడిపించాడు. ఈ అంశాలలో తనను ప్రతిపక్షాలు చక్రబంధంలో ఇరికించడంతో, సమాధానం చెప్పి తప్పించుకోలేక, ఎదురుదాడికి దిగిన చంద్రబాబును ఏ మాత్రం ఆవేశానికి

## నిగ్రహం పాటించారు, సర్కార్‌ను నిలదీశారు.

లోనుగాకుండా మరింత జటిల పరిస్థితి సృష్టించడంలో రాజశేఖరరెడ్డి నేర్పు అందరి మెప్పు పొందింది. గత సమావేశాలలో కాంగ్రెస్ శాసనసభా పక్షం చీటికి మాటికి సవాళ్లు విసిరి, చంద్రబాబు హేళనలకు గురయ్యేది. ఇప్పుడా అవకాశమే ఇవ్వలేదు కాంగ్రెస్ పార్టీ ప్రభుత్వ తప్పులను ఎత్తి చూపడం, అవి ప్రజలకు బాగా అర్థమయ్యేవరకు

తరువ 8వ పేజీలో

# దొరల పాలనలో దిగజారిన జిల్లారైతాంగం పరిస్థితి!

నెల్లూరు జిల్లా పుట్టుపూర్వోత్తరాలు - 16

డాక్టర్ సి.వి. రామచంద్రరావు

ఆర్కాట్ నవాబు అశక్తుడై, తన కర్ణాటక రాజ్యంతోపాటు నెల్లూరు జిల్లాను సైతం ఈస్ట్ ఇండియా కంపెనీకి అప్పగించిన తర్వాత దాదాపు 70 సంవత్సరాల పాటు జిల్లా రైతాంగం పడిన బాధలు అన్ని ఇన్ని కావు. 1801 జూలై 31తేది నెల్లూరు జిల్లాను ఇంగ్లీషు దొరలు తమ వశం చేసుకున్నారు; కాని రైతుల నుంచి వసూలు చేయవల్సిన భూమిశిస్తు వంటి అంశాలలో సక్రమమైన రెవిన్యూ సెటిల్‌మెంట్ విధానం ప్రవేశపెట్టలేదు. దానితో వ్యవసాయం బాగా దెబ్బ

## పండిన పంటలో సగానికి పైగా 'శిస్తు మక్తా'గా వసూలు

తిన్నది. రైతులు రకరకాల కడగండ్లకు గురైనారు.

ఇంగ్లీషు కంపెనీ కలెక్టర్ల పాలనకు పూర్వం నెల్లూరు జిల్లా 23 పరగణాలుగా విభజించబడి వుండింది. వాటిని మళ్లీ 110 క్షేత్రాలుగా విడదీసి వుండేవారు. ఆనాటికి జిల్లాలో గ్రామాల సంఖ్య - 616. వ్యవసాయ కమతాలను మడకలు అనేవారు; వాటి సంఖ్య 16వేలు. జిల్లా మొత్తం మీద ఒక లక్షాయాభైవేల పశువులు వుండేవి.

శిస్తు మూడు రూపాలలో వసూలు చేసేవారు. మొదటిది - తీర్వా; దీన్ని ధన రూపంలో వసూలు చేసేవారు. రెండవది - వీరం; దీనిక్రింద పండిన ధాన్యంలో భాగం లెక్కకట్టి తీసుకునేవారు. మూడవది - జోడి; ఈ పద్ధతిలో రైతు భూమి సాగు చేసుకునేందుకు ఒక నిర్ణీత మొత్తం నిర్ణయించేవారు.

పెన్న, స్వర్ణముఖి నదులు ప్రధాన నీటి వనరులు. వీటి నుంచి 24 కాలువలు త్రవ్వారు అనాడు. అవి 115 గ్రామాలకు సేద్యపు నీరు అందించేవి. ఈ కాలువలు పూడి పోకుండా ప్రతి సంవత్సరం పూడిక తీయించేవారు. అందుకు 1500 పగోడాలు ఖర్చు చేసేవారు. ఈ నదులు కాక, 484 చెరువుల ద్వారా దాదాపు 500 గ్రామాలకు నీరు అందించేవారు. జిల్లాలోని ఈ నీటిపారుదల వ్యవస్థ సమస్తం విజయనగర రాజుల కాలంలో నిర్మించింది కావడం గమనార్హం. వర్షాలు బాగా కురిసిన సంవత్సరంలో ఏడాదికి 81వేల పుట్ల ధాన్యం పండేదని బ్రిటీష్ వారు లెక్కకట్టారు. ఇందులో సగం శిస్తు క్రింద సర్కారు వారు దండుక పోయేవారు. అయితే అందులో 3లక్షలా 63వేల 924 పగోడాల విలువైన ధాన్యం బ్రిటీష్ ప్రభుత్వానికి చేరేది. తతిమాది జమిందారులు, పాలెగాళ్లు వుంచుకునేవారు.

అయితే జిల్లా కలెక్టర్లకు ఇక్కడ ప్రజల జీవన విధానం, సంస్కృతి, ఆర్థిక పరిస్థితులపై సరైన అవగాహన లేక పోవడం వల్ల, జమిందారుల దుష్పరిపాలన వల్ల, రెవిన్యూ అధికారుల లంచగొండి తనం వల్ల, రైతుల అమాయకత్వం వల్ల శిస్తు వసూలులో చాలా అక్రమాలు జరిగేవి. ఇంగ్లీషు కంపెనీ ప్రభుత్వం నుంచి శిస్తు వసూలు చేయడానికి నియమితులైన వారు, శిస్తు దండకాన్ని గుత్తకు తీసుకున్న ఇజారాదార్లు రైతులను నానా హింసలకు గురి చేసేవారు. దీనికి తోడు ఒక్కొక్క కలెక్టర్ ఒక్కొక్క కొత్త పద్ధతి ప్రవేశపెట్టేవాడు. అది రైతులను మరింత గందరగోళానికి గురి చేసి మధ్యవర్తుల దోపిడికి ఆస్కారం కల్పించేవి.

### కలెక్టర్ ట్రావెర్సీ అపనమ్మకం

కర్ణాటక నవాబు కాలంలో ఒకసారి

## 'మక్తాపుల్లరి' విధానంలో బంజర్లపై రైతులకు హక్కు కల్పించారు.

బ్రిటీష్ కంపెనీ అధికారులు నెల్లూరుకు కలెక్టర్‌ను నియమించి నప్పటికీ, ఆ తర్వాత మళ్లీ నవాబు పరిపాలన ప్రారంభం కావడం తెల్సిందే. కంపెనీ ప్రభుత్వం జిల్లా పైన పూర్తి హక్కు పొందింది 1801లో; అప్పుడు వారు నియమించిన తొలి కలెక్టర్ జె.బి. ట్రావెర్సీ. 1801 ఆగష్టు 2తేది ట్రావెర్సీ నెల్లూరులో అధికార బాధ్యతలు స్వీకరించాడు.

ఆయన వచ్చేటప్పటికి నెల్లూరు జిల్లాలో శిస్తు వసూలు అధిక భాగం ఇజారాదార్ల ద్వారా జరిగేది. ఇజారాదారు అంటే కొన్ని నిర్ణీత గ్రామాలలో శిస్తు వసూలు చేయడానికి కొంత కాలానికి కౌలుకు తీసుకున్నవాడు అని అర్థం. కర్ణాటక నవాబు ప్రవేశపెట్టిన పద్ధతి ఇది. కొన్ని చోట్ల మాత్రం ఫౌజ్‌దారు అనబడే సైనిక అధికారులే శిస్తు వసూలు చేసేవారు. ట్రావెర్సీ ఈ పద్ధతి తొలగించి రైత్‌వారీ పద్ధతిలో శిస్తు వసూలు చేయడానికి ప్రయత్నించాడు. కాని కౌలుదారులు చూపించే లెక్కలు తప్పుడువని తేలడంతో శిస్తు వసూలులో మార్పులకు సాహసించ లేకపోయాడు. ఇజారాదారుల పట్ల ఆయనకు ప్రగాఢమైన అపనమ్మకం ఏర్పడింది.

### రెవిన్యూ సంస్కరణలు

అయితే రెవిన్యూ సంస్కరణలకు మాత్రం కలెక్టర్ ట్రావెర్సీ శ్రీకారం చుట్టాడు. అందుకోసం ఆయన జిల్లాలోని నీటి వనరులపై ఒక అధ్యయనం

కొరవ 7వ పేజీలో

# కొత్త చరిత్రకు శ్రీకారం!

భారత, అమెరికా సంబంధాలలో ఒక నూతన అధ్యాయానికి నాంది పల్కారు - ప్రెసిడెంట్ బిల్‌క్లింటన్; కొత్త చరిత్రకు శ్రీకారం చుట్టారు. మన ప్రధాన మంత్రి వాజ్‌పాయి వాషింగ్టన్ పర్యటన సందర్భంగా ఆయన వ్యవహరించిన తీరు, జరిపిన స్వాగత సత్కారాలు, పలికిన పసిడి పల్కులు అపూర్వం. ఒక్క భారతీయులే కాదు, యావత్ ప్రపంచమే దీన్ని చూసి విస్తుపోతున్నది; నిజమని విశ్వసించ లేకపోతున్నది.

గత యాభై ఏళ్ల చరిత్రలో రెండు దేశాల మధ్య పేరుకు దౌత్య సంబంధాలు కొనసాగుతున్నప్పటికీ, వాటిలో విశ్వాస రాహిత్యమే అధికం. అమెరికాను నమ్మకూడదన్నది మనకు అనుభవం నేర్పిన పాఠం. వారికెప్పుడూ మనమంటే చిన్న చూపు, చులకన భావం! ప్రచ్ఛన్న యుద్ధం జరిగిన 30, 40 ఏళ్ల సుదీర్ఘ కాలంలో అమెరికా మొగ్గు ఎప్పుడూ పాకిస్తాన్‌వైపే వుండింది. అందువల్ల భారతదేశం తన సైనికావసరాల కోసం సోవియట్ రష్యావైపు మరలక తప్పలేదు. పైపెచ్చు జవహర్ లాల్ నెహ్రూ సోషలిస్ట్ భావుకుడు. ఆయనతోపాటు, ఆ తరం జాతీయనేతలందరూ పెట్టుబడిదారీ వ్యవస్థను ఏహ్యభావంతో చూసేవారు. ఇందిరాగాంధీ సైతం బహుళ జాతి సంస్థలను దరిచేరనివ్వలేదు. ఈ రాజకీయ ఆర్థిక విధానాలు భారత్, అమెరికాల మధ్య ఎప్పటికప్పుడు దూరం పెంచాయి. పాకిస్తాన్ వారికి మిత్రదేశం అయ్యింది.

ఇప్పుడు వున్నట్టుండి తలక్రిందుల మార్పు తెచ్చారు ప్రెసిడెంట్ క్లింటన్. మొన్న మార్చి నెలలో ఆయన ఇండియా పర్యటనకు వచ్చినప్పుడే ఆ సూచనలు కన్పించాయి. రక్తపాతం ద్వారా సరిహద్దులలో మార్పు తెచ్చే ప్రయత్నం చేస్తే సహించమని చాలా కఠినంగా హెచ్చరించారాయన. పాకిస్తాన్‌తో అమెరికాకు గల సత్సంబంధాల చరిత్ర తెలిసిన వారికి ఈ ప్రకటన నమ్మశక్యం కానిది! వారి దృక్పథంలో మార్పుకు వాజ్‌పాయి వాషింగ్టన్ పర్యటన సంపూర్ణ స్వరూపం సంతరించి పెట్టింది.

జర్మని, జపాన్, ఇంగ్లండ్ వంటి అగ్రరాజ్యాధినేతలతో సమానమైన స్వాగత సత్కారం జరిపారు వాజ్‌పాయికి! ఉభయ దేశాల మధ్య 35వేల కోట్ల రూపాయల విలువైన ఒప్పందం సంతకం చేయడం; వాజ్‌పాయిని వ్యక్తిగతంగా పొగడ్తలతో ముంచెత్తడం; వైట్‌హౌస్ చరిత్రలో ఎప్పుడూ జరగనంత పెద్ద విందు ఏర్పాటు చేయడం ఒక ఎత్తు! భారత, అమెరికాలు కలిసి పని చేస్తే ప్రపంచ గతినే మార్చవచ్చునన్న ప్రకటన ఒక్కటే ఒక ఎత్తు. ప్రపంచంలో మనది అతి పెద్ద ప్రజాస్వామ్య దేశం అయినప్పటికీ - అమెరికన్లు ఆ విలువను గుర్తించడం ఇదే ప్రథమం. పైపెచ్చు ఇదే సమయంలో వాషింగ్టన్ నగరంలోనే వుండిన పాక్ సైనిక పాలకుడు జనరల్ ముషారఫ్‌కు అపాయింట్‌మెంట్ ఇవ్వడానికి తిరస్కరించాడు బిల్‌క్లింటన్. ఈ సమయంలో ఆయనతో సమావేశం జరిపితే - భారత దేశం పట్ల తాము ప్రదర్శించబోతున్న అవ్యాజ్య ఆదరాభిమానాలకు, నెలకొల్పబోతున్న స్నేహ సంబంధాలకు తగిన ప్రాధాన్యత రాకుండా పోతుందన్న ఉద్దేశ్యంతోనే పాకిస్తాన్ పాలకుడ్ని అవమానించింది అమెరికన్ ప్రభుత్వం. అంతర్జాతీయ రాజకీయాలలో ఇదొక విచిత్ర పరిణామం. మయ సభలో ద్రౌపది చేత పరాభవింపబడిన దుర్యోధనుడి వలె ఖిన్న వదనంతో ఇస్లామాబాద్‌కు తరలి వెళ్లాడు ముషారఫ్; అశ్వమేధ యాగం నిర్విఘ్నంగా పూర్తి చేసిన ధర్మరాజు వలె సగర్వంగా ఢిల్లీకి తిరిగి వచ్చాడు - వాజ్‌పాయి.

ఈ మార్పుకు కారణం ఏమిటి? తమ వత్తిడికి లొంగి, తమ దారిలో నడవడానికి భారత ప్రధాని అంగీకరించడమా? అది నిజం కాదు. అమెరికా కోరుతున్నట్లు సిటిబిటి ఒప్పందంపై సంతకం చేయడానికి కాని, కాశ్మీర్ వివాదంలో అమెరికా మధ్యవర్తిత్వానికి కాని, పాకిస్తాన్‌తో చర్చలకు కాని వాజ్‌పాయి సమ్మతించలేదు. వారి అభీష్టం ప్రకారం జర్మనీ, జపాన్‌లకు వలె ఇండియాకు సైతం అణు యుద్ధ ప్రమాదాల రక్షణ బాధ్యత అమెరికాకు అప్పగించడానికి వాజ్‌పాయి అంగీకరించలేదు. మరేమిటి కారణం?

జమీన్‌రైతు

అంతర్జాతీయంగా పెరిగిపోతున్న ముస్లిం తీవ్రవాద సమస్య; దానికి పాకిస్తాన్ కేంద్రస్థానం కావడం; ఆసియా ఖండంలో బలీయంగా ఎదుగుతున్న చైనాను నిలువరించడానికి భారతదేశం ఒక్కటే సమర్థురాలు అన్న అభిప్రాయం - అమెరికా వైఖరిలో మార్పుకు ప్రేరణ అయివుండవచ్చు. సంస్కరణల ఫలితంగా, అపారమైన భారతీయ మధ్యతరగతి జనాభా నుంచి లబ్ది పొందడానికి పెట్టుబడులతో సిద్ధపడుతున్న అమెరికన్ వ్యాపార సంస్థల వత్తిడీ క్లింటన్‌పై పనిచేసి వుండవచ్చు.

కారణం ఏదైనా కానీ అమెరికన్లు భారత దేశంతో సన్నిహితం కావడానికి సిద్ధపడడం ఒక శుభపరిణామం. దీని వల్ల ప్రపంచంలో మన దేశ ప్రాధాన్యత పెరుగుతుంది. అమెరికాతో పాటు, ఇంగ్లండ్ వంటి పాశ్చాత్య దేశాలలో నివశించే లక్షలాది మంది భారతీయులకు గౌరవం సమకూరుతుంది. అమెరికాలో లభించే ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాలను అంది పుచ్చుకొని మన ప్రజల జీవన ప్రమాణాలు పెంచుకునేందుకు ఇదొక ముందడుగు. అమెరికన్ అధ్యక్షుడు అందించిన స్నేహ హస్తాన్ని సక్రమమైన రీతిలో వినియోగించుకోవడం మన పాలకుల బాధ్యత. అట్లని ఈ ఆసరాతో బహుళ జాతి సంస్థలు భారతీయ పరిశ్రమలను, సంస్కృతిని నాశనం చేసేందుకు ప్రయత్నిస్తే మాత్రం సమర్థవంతంగా త్రిప్పికొట్టడం కూడా అవసరమే. అమెరికన్‌ల రాజకీయాలకు ప్రాతిపదిక నూటికి నూరుపాళ్లు ఆర్థికాంశాలు మాత్రమేనన్న నిజం మరువకూడదు.

ప్రపంచ దేశాధినేతల సరసన, సమస్థానం పొంది, దేశ గౌరవాన్ని ఇనుమడింప జేసి, భారత ప్రజానీకానికి కొత్త ఉత్సాహం ఇచ్చి తిరిగి వస్తున్న ప్రధాని వాజ్‌పాయిని మనసారా అభినందిస్తున్నాము. *

---

జమీన్‌రైతు

22.9.50

వెల: 0-3-0 పేజీలు: 12

## సిద్ధీపురంలో కూలీల దౌర్జన్యం

సిద్ధిపురం కాలనీ వ్యవహారం శృతిమించిరాగాన పడింది. కాలనీ వాసులకు, హరిజన వ్యవసాయ కూలీలకు మధ్య వచ్చిన విభేదాలు రైటింగుల వరకు పోయినవి. ల్యాండు కాలనైజేషన్ స్కీమ్ క్రింద సిద్ధిపురంలో ఒక కాలనీ గత సంవత్సరం ఏర్పడింది. యానాది, ఎరుకల, ఆదిగాగల నిమ్నజాతులు 200 కుటుంబాలకు ఆకాలనీలో ఆశ్రయ మివ్వబడింది. గత సంవత్సరం ఏర్పాటు ప్రకారం కాలనీకి 300 ఎకరాల పేద కూలీలకు 400 ఎకరాలు ప్రత్యేకించబడినది.

కూలీలకు యివ్వబడ్డ 400 ఎకరాలు, సహకార పద్ధతిని దున్నబడింది గాని, సాగుకాలేదు. ఈ సంవత్సరం సిద్ధిపురం, పడమటిపాళెం, వెంగారెడ్డిపాళెం కూలీలు కాలనీ అచ్చట ఎత్తివేయాలని పట్టుబట్టారు. కాలనీలోని వారు సాగుచేస్తే తాము సాగు చేయగలమని వారు చెప్పారట. కలెక్టరు పోయి తాను దీనిని త్వరలో పరిష్కరిస్తానని సలహా చెప్పివచ్చారట.

మద్రాసులో జరిగిన మంత్రులు, బోర్డు మెంబర్ల సమావేశంలో సిద్ధిపురం కాలనీ అట్లనే వుంచవలసినట్లు ఏకగ్రీవంగా తీర్మానించబడింది.

డిప్టీ కలెక్టరు, ఈ కాలనీలో ఉండగా బెజవాడ రామచంద్రారెడ్డి కుమారుడు, సోషలిస్టు పాపిరెడ్డి కారులోవచ్చి, భూములు పంచడానికి ప్రభుత్వ వుత్తర్వేదైనా వున్నదా అని కొంటెగా ప్రశ్నించారని, వుత్తర్వు లేకుండా ఏ పని చెయ్యనని, ఆర్‌డిఓ

**50 ఏళ్ల క్రితం ఈ నాడు**

చెప్పగా, అది రహస్యమైందా, బహిరంగమైనదా అని తిరుగా ప్రశ్నించాడని, దానికి ఆయన రహస్యమైనదని చెప్పారని తెలుస్తున్నది.

సాయంత్రమయిన తర్వాత రాఘవయ్య నెల్లూరు వచ్చుటకు కాలనీ నుండి రోడ్డు దగ్గరకు చేరి పాపిరెడ్డితో మాట్లాడుతుండినాడని, ఇంతలోనే ఎవరోవచ్చి వారు వేసుకొంటుండిన కాలనీ వారిపై కర్రలు, కత్తులతో దండెత్తి వస్తున్నారని చెప్పారని, రాఘవయ్యగారు వెంటనే ఏదైనా

తరువాయి 10వ పేజీలో

---

# జనవాణి

# 'పాక్' నోట ప్రజాస్వామ్యం మాటా?

స్వదేశంలో ప్రజాస్వామ్యం పీక నులిమిన పాకిస్తాన్ సైనిక పాలకుడు ముషార్రఫ్ ఐక్యరాజ్య సమితి శిఖరాగ్ర సదస్సులో స్వేచ్ఛా, స్వాతంత్ర్యాల గూర్చి మాట్లాడారు. కాశ్మీర్‌లో నిత్యం తీవ్రవాదాన్ని ప్రోత్సహిస్తూ మనదేశంతో నిర్యుద్ధ సంధి గూర్చి మాట్లాడడం అతనికే చెల్లింది. ప్రధాని వాజ్‌పాయి తన ప్రసంగంలో పాకిస్తాన్ పేరు ప్రస్తావించకుండానే ఆ దేశ పాలకుల నైజాన్ని ప్రపంచ దేశాధి నేతల ముందు చక్కగా ఆవిష్కరించారు. పాకిస్తాన్ తను చేస్తున్న దుష్ప్రచారం ఆపుతుందనుకొంటే అది అత్యాశే అవుతుంది కాని దాన్ని మనం నిత్యం ఖండిస్తూ వుండాలి.

నెల్లూరు — టి.శ్రీనివాసాచారి

## ప్రభుత్వాల రెండు నాల్కల ధోరణి

కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం తమ అజెండాలో మతతత్వానికి తావులేదని ప్రకటించింది. కాని ప్రధాని వాజ్‌పాయి తన అమెరికా పర్యటనలో విశ్వహిందూ పరిషత్ సదస్సులో పాల్గొనడం తోపాటు ఆర్ఎస్ఎస్ గూర్చి గొప్పలు చెప్పారు. మతతత్వం, కులతత్వంతో రెచ్చగొట్టడమనేది బిజెపి ప్రభుత్వం అసలు అజెండా అని ప్రజలు గుర్తించకమానరు. రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల ఇళ్లకు కొత్తగా కరెంట్ కనెక్షన్లు దరఖాస్తు చేసిన వెంటనే ఇస్తామన్నారు. గ్రామాల్లో కొన్ని చోట్ల ఆ ప్రకారమే ఇచ్చారు. కాని తాము అక్రమంగా ఐదేళ్లనుంచి కరెంట్ వాడుతున్నట్లు దీనికి జరిమానా విధిస్తే చెల్లిస్తామన్న డిక్లరేషన్ వున్న అప్లికేషన్‌పై ప్రజలతో సంతకాలు పెట్టించుకొన్నారు. ఈ విధంగా ద్వంద్వ వైఖరిని ప్రదర్శించడం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకే చెల్లింది.

గంగవరం — జి. రామకృష్ణప్రసాద్

## బాలాజీనగర్‌కు మరికొన్ని టౌన్‌బస్సులు

నెల్లూరు టౌన్ పరిధిలో బాలాజీ నగర్ ప్రాంతం విస్తరించుకొన్న రీతిలో త్వరగా మరే ప్రాంతం విస్తరించలేదు. గడచిన పదేళ్లలో జనాభా కూడా విపరీతంగా పెరిగిపోయింది. కాని ఈ ప్రాంతీయులంతా టౌన్ బస్ ఎక్కాలంటే పాలబూత్ సెంటర్‌లోని వినాయకుడి గుడి వద్దకు రావాలి. దీనివల్ల ఇబ్బందులు పడుతున్నారు. అందరికీ అందుబాటులో వుండేలాగున కొన్ని టౌన్‌బస్సులు ఎన్టీఆర్ నగర్ నుండి పుట్టవీధి, సౌత్ స్టేషన్ అండర్ బ్రిడ్జి గుండా వేదాయపాళెం వరకు నడపాలి. మరికొన్నింటిని వేణుగోపాలస్వామి కాలేజి నుండి పద్మావతి నగర్, సాయిరాం నగర్, పిల్లల పార్కు, సౌత్ స్టేషన్ అండర్ బ్రిడ్జి గుండా వేదాయపాళెం వైపు నడిపిన ఎంతో మందికి సౌకర్యంగా వుంటుంది. ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని కొత్త రూట్లను ఆర్టీసీ ప్రతిపాదిస్తే బాగుంటుంది.

నెల్లూరు — బి. పట్టాభిరామయ్య

## అందరికీ ఒకే న్యాయం ఎప్పటికి?

ఎన్నికల రాజకీయాలే ముఖ్యమైన నేటి పరిస్థితుల్లో, కామన్ సివిల్ కోడ్ వంటి ప్రజలకు పనికి వచ్చే అంశాలను అమలు చేయడానికి రాజకీయ పక్షాలకు తీరికే దొరకడం లేదు. దేశంలో వీలైనంత త్వరగా కామన్ సివిల్ కోడ్‌ను అమలు చేయాలని రాజ్యాంగ నిర్మాతలు సూచించారు. ఎప్పుడనేది పార్లమెంట్

తరువాయి 10వ పేజీలో

# పెద్దాస్పత్రికి పట్టింది పెద్దరోగం

అంగట్లో అన్నీ వున్నా అల్లుడు నోట్లో శని వున్నట్లుగా, నెల్లూరు ప్రభుత్వాసుపత్రిలో సకల సబ్బంది సౌకర్యాలున్నా వినియోగించుకొనేవారు కరువ

## వసతులు, వనరులున్నా సేవ చేసేవారు ఏరన్నా!!

య్యారు. డాక్టర్లకు ప్రైవేట్ ప్రాక్టీస్‌పై ఉన్న శ్రద్ధ ఆస్పత్రిలో రోగులపై లేదు. ప్రతి ఆపరేషన్ కేసుకు డాక్టర్ ఇంటి వద్ద ముడుపులు ఇచ్చుకోనిదే పని జరగదు. ఆపరేషన్ తర్వాత కూడా జేబుల్లోంచి డబ్బులు తియ్యందే వైద్య సహాయం అందదు. ధర్మాస్పత్రి అన్న పేరేగాని అన్నింటికి డబ్బుతోనే లింకు ఉండటంతో వసతులు ఉన్నా రోగులు రావడం లేదు. పెద్దాసుపత్రిలో డాక్టర్లతో పాటు సుశిక్షితులైన వంద మందికిపైగా సిబ్బంది వున్నారు. డాక్టర్లతో ఎండి, ఎం.ఎస్. వంటి మాస్టర్ డిగ్రీలు కల్గి సుదీర్ఘ అనుభవం కల్గిన ఒక ఫిజీషియన్ తోపాటు, ముగ్గురేసి సర్జన్లు, ఆర్థోపెడిక్స్ స్పెషలిస్టులున్నారు. పిరికి తోడు చెవి, ముక్కు, పళ్ల, మానసిక వైద్య నిపుణుడు, మహిళల కోసం గైనకాలజిస్టులు, మరో

తరువ 11వ పేజీలో



టెలికాం శాఖలో సంచార్ సారథి అవార్డులను సిజిఎం రామానుజం నుంచి అందుకొంటున్న కమర్షియల్ సెక్షన్ క్లర్క్ నిర్మల, ఓజిబి ఎక్స్ఛేంజ్ టెక్నీషియన్ రమణయ్య

# వందల టన్నుల బియ్యం బొక్కుతున్న సర్కారీ పందికొక్కులు

నెల్లూరు సమీపంలోని కాకుటూరు సివిల్ సప్లయిస్ గోడౌన్లలో సర్కారీ 'పందికొక్కులు' రెండున్నర కోట్ల రూపాయల విలువైన బియ్యాన్ని బొక్కుతున్నారు. గోడౌన్‌లో ప్రారంభమైన బియ్యం పంపిణీ అవినీతి, డీలర్ వరకు చేరి, చివరకు పేద ప్రజలపైనే భారం పడే పరిస్థితి నెలకొనింది. గుట్టుచప్పుడు కాకుండా సాగిపోతున్న ఈ 'సర్కారీ పందికొక్కుల' బియ్యం కుంభకోణం వివరాలిలా వున్నాయి. కాకుటూరులో ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా గోడౌన్ల నుంచి ప్రతి నెలా జిల్లాలోని సివిల్ సప్లయిస్ స్టాక్ పాయింట్లకు బియ్యం తరలిస్తారు. వెంకటగిరి, పొదలకూరు, వాకాడు, నాయుడుపేట, రాపూరు, ఇందుకూరుపేట, నెల్లూరు, సూళ్లూరుపేటలోని సివిల్ సప్లయిస్ గోడౌన్లకు కాకుటూరు నుంచే బియ్యం సరఫరా జరుగుతుంది. గోడౌన్ అధికారులు, రవాణా కాంట్రాక్టర్లతో కుమ్మక్కై, ఒక లారీ లోడుకు, 150 కిలోల ధాన్యం తగ్గించి పంపుతున్నారు. ప్రతి నెలా జిల్లాలోని స్టాక్ పాయింట్లకు కనీసం రెండు వందల లారీ లోడుల బియ్యం తరలిస్తున్నారు. ఈ లెక్కన నెలకు 30 టన్నులు, సంవత్సరానికి 360 టన్నుల బియ్యం ఎఫ్‌సిఐ గోడౌన్‌ల వద్దనే స్వాహా చేస్తున్నారు.

## కాకుటూరు ఎఫ్.సి.ఐ. గోడౌన్లలో కోట్ల కుంభకోణం

గోడౌన్‌ల నుంచే బియ్యం తూకం తగ్గిరావడంతో స్టాక్ పాయింట్‌ల సిబ్బంది కూడా ఈ అవకతవకలను ప్రస్తావించకుండా ఈ తరుగుదలను డీలర్లపై నెట్టివేస్తున్నారు. కొన్ని స్టాక్ పాయింట్లలో సిబ్బంది, ఎఫ్‌సిఐలో మాదిరే చేతివాటం ప్రదర్శిస్తున్నారు. మొత్తం మీద డీలర్ వద్దకు చేరేటప్పటికి, ప్రతి పది బస్తాలకు కనీసం అర బస్తా బియ్యం తగ్గుతోంది. ఈ నష్టాన్ని మాఫీ చేసుకొనేందుకు డీలర్ కూడా చేతివాటం తూకాల్లో మోసం చేసి, చివరకు తమ అవినీతి భారాన్ని ప్రజలపైనే మోపుతున్నారు. ఎఫ్‌సిఐ గోడౌన్ నుంచి, డీలర్ వరకు సీరియల్‌గా సాగే ఈ అవినీతి కథకు ముగింపు చెప్పేవాళ్లు కరువయ్యారు. గతంలో సతీష్‌చంద్ర జాయింట్ కలెక్టర్‌గా ఉన్నప్పుడు, గోడౌన్, స్టాక్ పాయింట్‌ల వద్ద తరచూ తనిఖీలు చేసేవారు. కంప్యూటర్ కాటాలు ఏర్పాటు చేయమని గట్టిగా ఆదేశాలు ఇచ్చేవారు. ఆయన బదలీ తర్వాత గోడౌన్‌లలో అవినీతి గురించి పట్టించుకొనే వారు కరువయ్యారు. ఇప్పుడు కలెక్టర్, జాయింట్ కలెక్టర్ ఇద్దరూ కొత్తవారే. కరువైన అధికారులే. వారైనా ప్రజలపాలిట శాపంగా పరిణమించిన 'సర్కారీ పందికొక్కుల అవినీతి' అరికట్టగలిగితే బాగుంటుంది!

## ప్రమాదాల కేసులు జాగ్రత్తగా చూడాలి

కంటిన్యూయింగ్ మెడికల్ ఎడ్యుకేషన్ కార్యక్రమం జయభారత్ హాస్పిటల్‌లో 17తేది జరిగింది. 250 మంది ప్రభుత్వ, ప్రభుత్వేతర డాక్టర్లు హాజర

## తూకాల్లో భారీ మోసం, ప్రజలపై అదనపు భారం

య్యారు. డాక్టర్లకు విధి నిర్వహణలో ఎదురయ్యే మెడికో - లీగల్ సమస్యలు వాటి పరిష్కారాల గూర్చి నూరత్ మెడికల్ కాలేజి ఫోరెన్సిక్ మెడిసిన్ ప్రొఫెసర్ బి. సుబ్రహ్మణ్యం వివరించారు. ఎస్పీ సి.వి. నరసయ్య మాట్లాడుతూ మెడికో లీగల్ కేసులను శాస్త్రీయంగా సత్వరంగా పరిశోధించేందుకు అనుభవజ్ఞులైన డాక్టర్ల సహాయాన్ని వైద్యులు తీసుకోవాలన్నారు. జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి మధుసూదన్ సింగ్, పెద్దాసుపత్రి సూపరింటెండెంట్ డాక్టర్ జీవన్, జయభారత్ హాస్పిటల్ యాజమాన్యం తరఫున పి. సీతారామిరెడ్డి మాట్లాడారు. ప్రముఖ గుండె శస్త్ర చికిత్స నిపుణులు డాక్టర్ జనార్ధనరెడ్డి అధ్యక్షత వహించారు. జయభారత్ హాస్పిటల్ చీఫ్ మెడికల్ ఆఫీసర్ డాక్టర్ కె. లక్ష్మీనారాయణ వందన సమర్పణ చేశారు.

## శాస్త్రీయ, లలిత సంగీత విభావరి

సింహపురి సంగీత సభ నేతృత్వంలో 24తేది టౌన్‌హాల్‌లో శాస్త్రీయ, లలిత సంగీత విభావరి జరుగుతుంది. సుప్రసిద్ధ సంగీత విద్వాంసులు టి. బాలకృష్ణ ప్రసాద్ ఈ సందర్భంగా కచ్చేరి నిర్వహిస్తారు. ఈ కార్యక్రమానికి నారాయణ మెడికల్ కాలేజి కో ఆర్డినేటర్

తరువ 11వ పేజీలో

# బియ్యం ధరలకు రెక్కలు

నెల్లూరులో మిల్లర్లు మూడు వేల టన్నుల బియ్యాన్ని అక్రమంగా నిల్వ చేశారని తెలుస్తోంది. ధాన్యాన్ని, బియ్యాన్ని దాచిపెట్టిన బ్లాక్ మార్కెటీర్లను విజిలెన్స్ అధికారులు పట్టించుకోక పోవడం వల్ల ధాన్యం ఉత్పత్తి పెరిగినా, బియ్యం ధరలు తగ్గలేదు. ఈ వ్యవహారంలో హోల్‌సేల్ - రిటైల్ వ్యాపారులు కుమ్మక్కయ్యారనిపిస్తుంది. ఈ యేడాది రాష్ట్రంలో విపరీతంగా ధాన్యం పండింది.

## నెల్లూరుసంగతులు

దీనివల్ల ధాన్యం రేట్లు ఎప్పుడూలేనంతగా తగ్గిపోయాయి. లావులు రకం ధాన్యం పుట్టి 4,800, సన్నాలు 5,500, మసూరి 5,700 రూపాయలకే కొనేవాళ్లు లేరని రైతులు వాపోతున్నారు. పై రేట్లను బట్టి లావులు బియ్యం కిలో 11 రూపాయలకు, సన్నాలు 12.50, మసూరి 13.50కు మార్కెట్‌లో దొరకాలి. కాని వ్యాపారస్తులంతా కుమ్మక్కై, లావులు 12.50, సన్నాలు 14, మసూరి 17 రూపాయలకు నిలబెట్టి అమ్ముతున్నారు. ఈ రేట్ల పెంపకం వల్ల మధ్య దళారీలు, వ్యాపారస్తులు లాభపడుతున్నారే తప్ప రైతులు - ప్రజలు నష్టపోతున్నారు. బ్లాక్ మార్కెటీర్లు ప్రైవేట్ గోడౌన్లలో దాచిన ధాన్యం నిల్వలపై విజిలెన్స్ అధికారులు దాడులు ముమ్మరం చేయాలి. ధాన్యం ధర తగ్గినా బియ్యం ధర తగ్గించని వ్యాపారస్తులతో జాయింట్ కలెక్టర్ ఒక ప్రత్యేక సమావేశం ఏర్పాటుచేసి హెచ్చరిక చేయాలి. అన్నిరేట్లు పెరిగిపోయిన ఈ రోజుల్లో తినేతిండి రేట్లయినా కాస్త తగ్గించకల్గితే సామాన్య, మధ్య తరగతి ప్రజలు రెండు ముద్దల అన్నం ఎక్కువ తినగల్గుతారు. లేకుంటే ఈ రేట్లతో అర్ధాకలితో మాడక తప్పదు.

## సిఐటి చీపురుపడితే సిబ్బంది సిబ్బిలుపట్టారు

పచ్చదనం - పరిశుభ్రం కార్యక్రమాన్ని పురస్కరించుకొని 16తేది జడ్పీ కార్యాలయంలో సిఇఓ వెంకటేశ్వరరావు

తరువ 11వ పేజీలో

# రెచ్చిపోతున్న రౌడీలు - బిక్కచచ్చిన పోలీసులు

నెల్లూరు టౌన్‌లో రౌడీయిజం వాప క్రింద నీరులా విస్తరిస్తుంది. రౌడీ ముఠాల మధ్య రేగిన చిన్న చిన్న స్పర్ధల మూలంగా ఈ యేడాది మొదటి నుంచి ఇప్పటి వరకు నెల్లూరులో నెలకొక హత్య లెక్కన జరిగింది. ఫ్యాక్షన్ లీడర్ల మాదిరి టౌన్‌లోని కొందరు రాజకీయ ముసుగులు తొడిగిన పెద్ద రౌడీలు, ఈ రౌడీయిజాన్ని మరింతగా పెంచి పోషిస్తున్నారు. పోలీసుల రికార్డుల ప్రకారమే టౌన్‌లో 300 వరకు రౌడీషీటర్లున్నారు. జెండా వీధి, బాలాజీనగర్, భక్తవత్సల నగర్, ఉమ్మారెడ్డిగుంట, విఆర్‌సి, వేదాయపాళెం సెంటర్లలోని రౌడీల ముఠాల మధ్య గ్రూపులున్నాయి. ఈ గ్రూపుల మూలంగానే ఈ యేడాది వేదాయపాళెంలో ఒక ఆటో డ్రైవర్ హత్య జరిగింది. మూలపేటలోనూ ఆ తర్వాత ఇరుగాళమ్మ గుడి వద్ద ఒకర్ని హత్యచేసి చెరువులో వేసి కాల్చారు. చేపల మార్కెట్ వద్ద కసాయి కొట్టు ఒక వ్యక్తిని హత్య చేశారు. బాలాజీనగర్‌లో సంజీవ్ అనే రౌడీషీటర్ హత్య చిన్న స్పర్ధల మూలంగానే జరిగాయి.

నెల్లూరులో ఫ్యాక్షన్ లీడర్లను తలపింపజేసే వాళ్లు సిపిఎం, కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీల్లో ఉన్నారు. వారికి కాపలాగా నిత్యం మారణాయుధాలు ధరించి పది నుంచి ఇరవైమంది రౌడీలుంటారు. వీరు ఎంతటికైనా తెగించే సమర్థులు. బిజెపి నేత రామకృష్ణారెడ్డి హత్య కేసులో ముద్దాయిలను కూడా నిత్యం మారణాయుధాలు కల్గివున్న

## నెలకో ఫ్యాక్షన్ 'హత్య'

వ్యక్తులు కాపలా కాస్తున్నారు. ఇటువంటి కాపలా ఖర్చును భరించలేక దాన్ని ఉపసంహరించుకొన్నందుకే రామకృష్ణారెడ్డి హత్య జరిగిన విషయం పాఠకులకు విదితమే. జెండావీధిలోని సిరాజ్, బిల్లి బషీర్ హత్యకేసులో నిందితులు, వారి అనుచరులు కూడా నిత్యం మారణాయుధాలు ధరించి వుంటారన్న విషయం పోలీసులకు తెల్సిందే.

ఏదో ఒక గొడవలో హీరోలు కావడం, వారిని మరికొంత మంది నిరుద్యోగులు వెంబడించడం - కేసుల్లో ఇరుక్కోవడం జరుగుతుంది. ఆ తర్వాత మనుగడ కోసం, డబ్బుల కోసం వారిని వెంబడించడం మామూలయ్యింది. ఇటీవల బాలాజీనగర్‌లో హత్య కావింపబడ్డ సంజీవ్ మొదట మంచివాడే. అతనికుటుంబంలోని వ్యక్తులు కూడా బాగా చదువుకున్నవారే. కాని ఒక రౌడీషీటర్‌తో స్నేహం సంజీవ్‌ను కూడా రౌడీషీటర్‌ను చేసి చివరకు అతని మరణానికి దారితీసింది. టౌన్‌లోని పలు మధ్యస్థాలు, పలు రకాల గొడవల పరిష్కారకర్తలు నేడు రౌడీషీటర్లే. కొంత మంది రౌడీషీటర్లను చూసి పోలీసులే భయపడుతున్నారంటే వీరి స్థాయిని అర్థం చేసుకోవచ్చు. ఎస్పీ సి.వి. నరసయ్య రౌడీషీటర్ల సంస్కరణలకు హైదరాబాద్‌లో ప్రత్యేక చర్యలు తీసుకొన్నట్లు చెబుతుంటారు. ఇక్కడ మాత్రం ఆయన రౌడీషీటర్ల గూర్చి పట్టించుకోవడం మానేయడంతో వాళ్లు పేట్రేగి పోతున్నారు.*



# ఉత్తర క్రియలు

రైతుజన బాంధవ్యుడు

మాకు మార్గదర్శకుడు

## జక్కా రంగారెడ్డి గారు

తే18-09-2000ది సోమవారం

స్వర్గస్థులైనారు. వారి

## పెద్దకర్మ

తే28-09-2000ది గురువారం ఉదయం

నెల్లూరు జిల్లా జగదేవిపేటలోని

మా స్వగృహామునందు జరుగును.

కావున తెలియజేయడమైనది.

## జక్కా కామేశ్వరమ్మ

భార్య

| కుమారులు | కోడళ్ళు |
|---|---|
| జక్కా రాధాకృష్ణారెడ్డి (Retd.E.D. A.P.S.R.T.C) | - |
| జె.కె. రెడ్డి (Ex. M.L.A) | సులోచన |
| జె.యస్. రెడ్డి SimhapuriAgroProducts(P)Ltd., | సౌదామిని |
| జక్కా శివనారాయణరెడ్డి J.S.R.Constructions(P)Ltd., | లక్ష్మీప్రసన్న |

| కుమార్తెలు | అల్లుళ్ళు |
|---|---|
| అనపల్లి శకుంతల | రామచంద్రారెడ్డి |
| కాటంరెడ్డి హంసవేణి | వేణుగోపాలరెడ్డి |
| మన్నెమేల అరుణ | కోదండరామిరెడ్డి |
| బట్టేపాటి విజయ | - |
| నాయుడు నిర్మల | వెంకటనరసారెడ్డి |

మనుమలు, మనుమరాండ్రు

మునిమనుమలు, మునిమనుమరాండ్రు

# నెల్లూరు ఎమ్మెల్యేలు
[illegible]

## వివేకా, సోమిరెడ్డి ఉపన్యాస వివరాలు

నెల్లూరు, సర్వేపల్లి శాసనసభ్యులు ఆనం వివేకానందరెడ్డి, సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి అసెంబ్లీ సమావేశాల్లో తమ ఉపన్యాస విన్యాసాలను పత్రికల వారికి వివరించారు.

అసెంబ్లీలో 15రోజుల పాటు జరిగిన కరెంట్ ఛార్జీల రచ్చారావిళ్లలో తాను అగ్రభాగాన నిలిచానని, పెరిగిన విద్యుత్ ఛార్జీలను తగ్గించమని నిలదీశానని వివేకా చెప్పారు. గతంలో పని చేసిన ఎమ్మెల్యేల కంటే, నెల్లూరు సమస్యలను ఎప్పటికప్పుడు ఏదో ఒక విధంగా అసెంబ్లీలో ప్రస్తావించిన ఘనత తనదేనని చెప్పారు. నెల్లూరులో మంచినీటి కొరత, మురికినీటి సరఫరా, సమ్మర్‌స్టోరేజి ట్యాంక్ ఆవశ్యకత మున్సిపాలిటీలో రెండు కోట్ల రూపాయల బిల్లుల చెల్లింపు, గ్రంథాలయ ఉద్యోగులకు జీతాలు రాకపోవడం, డ్రైనేజి కాలువల పూడికతీతలో అవినీతి, నెల్లూరులో బోగస్ ఫైనాన్స్ కంపెనీల మోసాలపై ప్రభుత్వాన్ని నిలదీశానన్నారు. అధికారపక్షం తన నోరు నొక్కాలని చూసినా ఏదో ఒక సందర్భంలో నెల్లూరు ప్రజల వాణిని అసెంబ్లీలో వినిపించగలిగానని వివేకా చెప్పారు.

సోమశిల ప్రాజెక్టును 50 టిఎంసిల సామర్థ్యానికి చేర్చడంలో ప్రభుత్వం నిర్ణయించుకున్న గడువును మరింత ముందుకు తీసుకు రాగలిగానని సోమిరెడ్డి చెప్పారు. సోమశిల, కండలేరు ప్రాజెక్టుల నిర్మాణంలో జాప్యం, వాటిని సకాలంలో పూర్తి చేయడానికి గల ఆవశ్యకతను గణాంకాలతో వివరించిన వైనాన్ని ఆయన విలేఖరుల సమావేశంలో వివరించారు.

సర్వేపల్లి కాలువకు మరమ్మత్తులు, రిజర్వాయర్ పటిష్టతకు మూడున్నర కోట్లతో ప్రతిపాదనల విషయమై ఇరిగేషన్ మంత్రి నుంచి తగిన హామి రాబట్టగలిగానని అన్నారు. మేనమామ నల్లపురెడ్డి శ్రీనివాసులురెడ్డి తరహాలోనే, తెలుగు గంగ ప్రాజెక్ట్ పుట్టు పూర్వోత్తరాలపై సోమిరెడ్డి, విలేఖరుల సమావేశంలో సుదీర్ఘ ఉపన్యాసం చేశారు.

## వంటేరు ఉత్తమ క్రీడాకారుడు

ఎమ్మెల్యేలకు జరిగిన క్రీడోత్సవాల్లో పలు రకాల ఆటలను అత్యుత్తమంగా ఆడి కావలి ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి బెస్ట్ స్పోర్ట్స్‌మెన్ అవార్డును అందుకొన్నారు. షటిల్ బ్యాడ్‌మింటన్ డబుల్స్, బాల్ బ్యాడ్‌మింటన్ సైన్స్, బాల్ బ్యాడ్‌మింటన్ డబుల్స్, టెన్నీకాయిట్ సింగిల్స్, టెన్నీకాయిట్ డబుల్స్‌లో వేణుగోపాలరెడ్డి ప్రథమ స్థానాన్ని సాధించారు. క్రికెట్ పోటీలో సిఎం టీమ్ తరఫున ఆడి నాలుగు పరుగులిచ్చి మంత్రి చంద్రశేఖర్, ఎం.ఐ.యం. నాయకుడు అసదుద్దీన్ ఒవైసీలను క్లీన్ బౌల్డ్ చేశారు. దీనికిగాను ఉత్తమ బౌలర్ అవార్డును పొందారు. క్యారమ్స్ డబుల్స్, లాన్ టెన్నిస్ డబుల్స్, వాలీబాల్, షటిల్ సింగిల్స్‌లో ద్వితీయ స్థానాన్ని సాధించారు. 75 మీటర్ల పరుగు పందెం, షాట్‌పుట్, జావలిన్ త్రో, డిస్కస్‌త్రోలో ప్రథమ స్థానం, టేబుల్ టెన్నిస్ సింగిల్స్, టేబుల్ టెన్నిస్ డబుల్స్‌లో ద్వితీయ స్థానం పొందారు. ఇన్ని ఆటల్లో అడి బహుమతులు పొందిన ఎమ్మెల్యే మరొకరు లేరు.

వేణుగోపాలరెడ్డి రాజకీయ నాయకుడు కాక మునుపు వ్యాపారవేత్త. మరి వ్యాపారవేత్తగా వుంటూనే ఇన్ని క్రీడల్లో ఇంత ప్రావీణ్యం ఎలా సంపాదించారో? జిల్లాలోని ఇతర ఎమ్మెల్యేలు ఈ క్రీడోత్సవాలలో పాల్గొన్నట్లు లేదు. క్రీడా స్ఫూర్తి అందరికీ వుంటుందా? ఉత్తమ క్రీడాకారునిగా నిలిచిన వంటేరుకు మా అభినందనలు.

## జిల్లా అభివృద్ధి మండలి సమావేశం 25న

జిల్లా అభివృద్ధి మండలి సమావేశం 25తేది ఇన్‌ఛార్జి మంత్రి చిక్కాల రామచంద్రరావు అధ్యక్షతన గోల్డెన్ జూబ్లీ హాల్‌లో జరుగుతుంది. కరవు, వరదలు అజెండాలో ముఖ్యాంశాలు. అయినా పెంచిన విద్యుత్ రేట్లపై ప్రకంపనలు కూడా చోటు చేసుకోవచ్చు.

## సిఎంను కలసిన జిల్లా ఎమ్మెల్యేలు

సోమశిల ప్రాజెక్ట్, కండలేరు డ్యాంలకు సంబంధించి అసంపూర్తిగా నిలచిపోయివున్న పనులను వెంటనే పూర్తి చేయాలని జిల్లా ఎమ్మెల్యేలు ముఖ్యమంత్రిని కలసి ముక్తకంఠంతో కోరారు. 15తేది ఇళ్లమంత్రి ఆదాల ప్రభాకరరెడ్డి నాయకత్వంలో ఎమ్మెల్యేలు చంద్రమోహన్‌రెడ్డి, ప్రసన్నకుమార్‌రెడ్డి, విజయరామిరెడ్డి, వివేకానందరెడ్డి, రామనారాయణరెడ్డి, కృష్ణయ్య, రాజ్యలక్ష్మమ్మలు కలసి ఒకే వాదన వినిపించే సరికి ముఖ్యమంత్రి ఆశ్చర్యపోయారట. జిల్లాలో ముఖ్యమైన సమస్యల పరిష్కారంపై ఎమ్మెల్యేలు పార్టీలు మరచి ఏకమై పోరాడడం శుభపరిణామం.

# రైతు జననేత 'జక్కా' కన్నుమూత

ప్రముఖ రైతు నాయకుడు జక్కా రంగారెడ్డి 18వ తేది సోమవారం మరణించారు. ఆయన వయస్సు 83 సంవత్సరాలు. చనిపోయే ఆరు నెలల ముందు వరకు రంగారెడ్డి 'స్టీల్‌మ్యాన్' లాగా వుండేవారు. అనారోగ్యం ఆయన దరిదాపులకు కూడా రాలేదు. కొడుకులంతా వివిధ రంగాలలో ఉన్నత స్థాయిలో ఉన్నా, తనే స్వయంగా పొలం పనులు చూసుకొనేవారు. జనవరి నెలలో అకస్మాత్తుగా జ్వరం రావడం, తర్వాత జరిగిన వైద్యపరీక్షల్లో ఉదర భాగంలో క్యాన్సర్ వ్యాధి బయటపడటం జరిగింది. దీనికి గుండె జబ్బు కూడా తోడైంది. అప్పటి వరకు ఎంతో హుషారుగా ఉండే రంగారెడ్డి, ఆ తర్వాత మానసికంగా చిక్కి సగమై పోయారు. హైదరాబాద్‌లో శస్త్ర చికిత్స తర్వాత, కొడుకు జె.కె.రెడ్డి ఆయనను నెల్లూరులోని తన ఇంట్లోనే పెట్టుకొని కంటికి రెప్పలా కాపాడుకున్నారు. దాదాపు 8 నెలలపాటు, అప్పుడప్పుడు తప్ప, నెల్లూరు వదలి పోలేదు. రేయింబవళ్లు దగ్గరుండి సేవలు చేశారు. ప్రతిరోజూ డాక్టర్లను పిలిపించి పరీక్షలు చేయించేవాడు. మరో గంటలో తుదిశ్వాస విడిచే దశలో, తనను జగదేవిపేటకు తీసుకు పొమ్మని, ఆస్పత్రికి వద్దని రంగారెడ్డి కోరాడట. పుట్టినగడ్డపై ఆయనకున్న అభిమానం అటువంటిది.

ఐదేళ్లపాటు జగదేవిపేట సర్పంచ్‌గా గ్రామాభివృద్ధికి ఆయన ఎనలేని కృషి చేశారు. సాగునీటి సంఘం అధ్యక్షుడుగా, స్వంతడబ్బు వ్యయం చేసి కాలువలకు మరమ్మత్తులు చేయించారు. గ్రామంలో రైతుల కోసం ఒక పశువుల ఆస్పత్రిని, అధునాతన వైద్యశాలను నిర్మించి ఇచ్చారు.

తన కళ్లముందే నలుగురు కొడుకులు, రాధాకృష్ణారెడ్డి, జె.కె.రెడ్డి, జె.ఎస్. రెడ్డి, శివనారాయణరెడ్డి ఉన్నతిని చూడగలిగిన అదృష్టవంతుడు.

రంగారెడ్డిగారికి నివాళులు అర్పించేందుకు జగదేవిపేటకు వచ్చిన జనంతో గ్రామం కిక్కిరిసి పోయింది. సాదాసీదా జనం, రైతులు తమ ఆత్మబంధువును కోల్పోయినట్టు భోరున విలపించారు. రాజకీయాలలో రాగద్వేషాలకు అతీతంగా రైతుల శ్రేయస్సు కోసం తపించే రంగారెడ్డి గారి మరణం జిల్లాకు తీరనిలోటు - ఆయన కుటుంబీకులకు మా ప్రగాఢ సానుభూతి.



## రాజేశ్వరమ్మ శరన్నవరాత్రులు

దర్గామిట్టలోని రాజరాజేశ్వరమ్మ 26వ శరన్నవరాత్రి మహోత్సవాలు సెప్టెంబర్ 28తేది నుంచి అక్టోబర్ 7తేది వరకు జరుగుతాయి. నిత్యపూజలతో పాటు సామూహిక నిత్యనవావరణ పూజ, సామూహిక నవ చండీహోమం, లలితా సహస్రనామ పారాయణాలుంటాయి. విజయదశమి రోజు మహాభిషేకం జరుపుతారు. 28తేది నుంచి 7తేది వరకు ఉదయం, సాయంత్రం

తరువాయి 7వ పేజీలో

## వై.ఎస్., ఓవైసి

మొదటి పేజీ తరువాయి

చర్చ జరిగేటట్లు చూడడం, నిర్ణయం ప్రభుత్వానికే వదలి వేయడం - ఇదీ ఈ సారి సిఎల్‌పి వ్యూహం! ఇంగ్లండ్, అమెరికా వంటి పరిణతి చెందిన ప్రజాస్వామ్య దేశాలలో అనుసరించే పద్ధతి ఇది. మొత్తం ప్రతిపక్షాన్ని పలుమార్లు సస్పెండ్ చేసిన స్పీకర్ ఒక్క సందర్భంలోనూ రాజశేఖరరెడ్డిని తప్పు పట్టలేక పోయింది. అంత హుందాగా వ్యవహరించారాయన.

నిరాహార దీక్షల విషయంలో మాత్రం రాజశేఖరరెడ్డి తన స్వంత పార్టీ నుంచే విమర్శలు ఎదుర్కొవలసి వచ్చింది. ఎవరితోనూ సంప్రదించకుండా దీక్ష ప్రారంభించాడని; ఎవరికి చెప్పకుండా దీక్ష చాలించాడని - విమర్శ. కాని విద్యుత్ సమస్య ఇంతగా జనంలోకి చొచ్చుక పోవడానికి దోహదపడింది ఈ నిరాహార దీక్షల వల్లనేనన్న సంగతి అందరూ మర్చిపోతున్నారు. దీక్షలు మొదలు రాజశేఖరరెడ్డి నిర్ణయమన్నది నిజమే కాని; తుది పలుకులో మాత్రం ఆయన మాట చెల్లుబడి కాలేదు. తతిమా ఎమ్మెల్యేలు, కాంగ్రెస్ నేతలు ఆయన్ను చుట్టుముట్టి బలవంత పెట్టడంతో నిస్సహాయుడై, వారి మాటననుసరించి వెళ్లాడన్నది నిజం. దీక్షలు కొనసాగితే రాజశేఖరరెడ్డి రాజకీయంగా మరీ ఎదిగిపోతాడన్న అసూయ కూడా పనిచేసిందిక్కడ.

అసదుద్దీన్ ఒవైసీ గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరమే లేదు. నెహ్రూ హయాంలో పార్లమెంట్‌లో అప్పటి జాతీయనేతలు వ్యవహరించిన తీరు స్ఫురణకు తెచ్చింది ఆయన శైలి. సభకు వచ్చే ముందు మాట్లాడదలచిన అంశంపై సమగ్రంగా అధ్యయనం చేయడం; చెప్పదలచుకున్నది సూటిగా చెప్పడం; విధానపర అంశాలలో అత్యంత గొప్ప అవగాహన ప్రదర్శించడం ఒవైసీలో కన్పించాయి. ప్రభుత్వాన్ని తన ప్రశ్నలతో, విమర్శలతో ఉక్కిరి బిక్కిరి చేశాడు. కాంగ్రెస్ నేతలు గంటసేపు మాట్లాడిన అంశంపై ఐదంటే ఐదు నిముషాలలో అంతకంటే సమర్థవంతంగా పాలక పార్టీని నిలదీశాడు ఒవైసీ. ప్రతిపక్ష సభ్యులందరూ ఆయన పొందగల్గితే - రానున్న సమావేశాలు మరింత రసవత్తరంగా వుంటాయి. ఆయన సమర్థతకు శాసన సభకంటే పార్లమెంట్ తగినచోటు!

## చరిత్ర

2వ పేజీ తరువాయి

జరిపించారు. కొన్ని ప్రధాన గ్రామాలలో మాత్రం రైతులకే నేరుగా శిస్తు చెల్లించే అవకాశం కల్పించారు. గ్రామాలకు వెళ్లి, అక్కడ ఎంత విస్తీర్ణంలో భూమి వుంది, ఎంత ధాన్యం పండుతుంది అన్న వివరాలు గ్రామస్తులనే అడిగి తెలుసుకుని, దాని ప్రకారం ఆ గ్రామానికి శిస్తు నిర్ణయించేవారు. భూమి సాగుకు సరైన కొలతలు, లెక్కలు లేని గ్రామాలలో ట్రావెర్సీ భూమి సర్వే జరిపించాడు. లెక్కలు సక్రమంగా వుంచనందుకు శిక్షగా ఈ సర్వేకి అయిన ఖర్చును ఆ కరణాల జీతాలలో కోత పెట్టాడు. అప్పటిలో గ్రామానికి ఒక కరణం; ఐదు గ్రామాలకు కలిపి ఒక స్థల కరణం వుండేవారు. ట్రావెర్సీ ఈ స్థల కరణం వుద్యోగాన్ని రద్దు చేశాడు.

కొత్తగా సాగుకు తెచ్చిన భూమిని కొలిచి, సర్వే చేసి, పండిన ధాన్యంలో శిస్తు ఎంతో నిర్ణయించేవారు. పండిన ధాన్యంలో వరి అయితే పుట్టికి 26 రూపాయలు, మేలు రకం వరికి 30 రూపాయలు, జొన్నలకు పుట్టికి 40 రూపాయలు లెక్కన శిస్తు వసూలు చేసేవారు.

ట్రావెర్సీ నెల్లూరు వదిలి వెళ్లే నాటికి జిల్లాలోని ప్రతి గ్రామం నుంచి ప్రభుత్వానికి రావల్సిన శిస్తు ఎంతో లెక్క తేలింది.

అయితే ప్రభుత్వం నేరుగా రైతులతో లావాదేవీలు నడపడం ఇష్టం లేని కొందరు గ్రామ పెద్దలు ఈ ప్రయత్నాన్ని విఫలం చేయడానికి కుట్ర పన్నుతున్నట్లు ట్రావెర్సీ గ్రహించాడు. రైతులు పొందవల్సిన ప్రయోజనాలు, లాభాలు ఈ పెద్ద మనుషులు తన్నుకపోవడం ఆయన దృష్టికి వచ్చింది. ఈ పెద్ద మనుషులు గ్రామంలోని మంచి భూములన్నిటిని ఆక్రమించేవారు. గడ్డి బీళ్లలో అధిక భాగం వీరి స్వాధీనంలో వుండేవి. భూమిపై పెత్తనం ద్వారా సంపాదించిన సంపాదనతో చిన్న రైతులను, కూలీలను తమ చెప్పు చేతలలో వుంచుకునేవారు. చిన్న రైతుల నుంచి ధాన్యం తక్కువ ధరలకు కొని, వారు కట్టవల్సిన శిస్తును వీరే ప్రభుత్వానికి చెల్లించేవారు. చిన్న రైతులకు తిండి కొరత ఏర్పడినప్పుడు వారి నుంచి తక్కువ ధరకు కొన్న ధాన్యాన్ని మళ్లీ వారికి ఎక్కువ ధరకు విక్రయించేవారు.

### శిస్తు మక్తా

ఈ పెద్ద మనుషుల దోపిడి నుంచి చిన్న రైతులను కాపాడడానికి కలెక్టర్ ట్రావెర్సీ "శిస్తు మక్తా" అనే పద్ధతి ప్రవేశపెట్టాడు. కాని అదిరైతుల పట్ల శాపంగా పరిణమించింది. అందుకు కారణం పండిన ధాన్యంలో 55 శాతం ప్రభుత్వానికి కట్టవల్సి రావడం. శిస్తు మక్తా పద్ధతి వివరం ఇది.

గ్రామం మొత్తం మీద 100 పుట్ల ధాన్యం పండితే అందులో నుంచి 6.5 పుట్ల ధాన్యం గ్రామ ఖర్చుల క్రింద దాచి వుంచాలి. తతిమా ధాన్యంలో 42.075 పుట్లు రైతులు తీసుకుని, 51.425 పుట్ల ధాన్యం ప్రభుత్వానికి ఇవ్వాలి. ఇది 55 శాతం శిస్తుతో సమానం. దీని కోసం ప్రతి గ్రామాన్ని కొత్తగా సర్వే చేసి, సాగు నేల సారం నిర్ణయించి, ఆ నేలల వుత్పత్తి ఎంత వుంటుందో అంచనా వేశారు కలెక్టర్. కొత్త పద్ధతి ప్రవేశపెట్టాలన్న తొందరలో హడావిడిగా సర్వే జరిపించడం వల్ల లెక్కలు సక్రమంగా తేలలేదు. గ్రామ విస్తీర్ణంలో మూలలన్నిటిని లంబ కోణాలుగా గుర్తించి గ్రామ విస్తీర్ణం నిర్ణయించారు. దీని వల్ల లెక్కలో చాలా తప్పులు వచ్చాయి. వీటిని సరిదిద్దేందుకు ప్రయత్నించలేదు.

భూమి విస్తీర్ణం సరిగా నిర్ణయం కాకపోవడం, పండిన పంటలో సగం పైన శిస్తు పేరుతో ప్రభుత్వం తన్నుకెళ్లడంతో రైతులు దివాలా తీశారు. అతివృష్టి అనావృష్టి వల్ల పంటలు సరిగా పండని వారి పరిస్థితి మరీ దుర్భరంగా మారింది. మాగాణి నేలలలో నాటిన విత్తనాలు ఎన్ని రెట్ల పంట దిగుబడి ఇస్తాయి అనే అంచనాతో వుత్పత్తిని, శిస్తును నిర్ణయించడంతో ఒక్కొక్కసారి రైతు పండించిన పంట మొత్తం శిస్తుకు సరిపోయేది. ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క రకం శిస్తు నిర్ణయం జరిగింది.

ఈ శిస్తు మక్తా పద్ధతి వల్ల రైతులు సాగు విస్తీర్ణం తగ్గించి వేశారు. ఒక సంవత్సరం వసూలైన శిస్తు మొత్తం ఆధారంగా తతిమా సంవత్సరాల శిస్తు నిర్ణయిస్తారనే వుద్దేశంతో రైతులు తమ పొలాలు బీడు పెట్టి శిస్తు తక్కువ వసూలయ్యేట్లు చేశారు.

### *బంజరులపై రైతులకు హక్కు*

బంజరు నేలలపై రైతులకు హక్కు కల్పించాలనే వుద్దేశ్యంతో కలెక్టర్ ట్రావెర్సీ "మక్తా పుల్లరి" అనే పద్ధతి ప్రవేశపెట్టాడు. సాగు కాకుండా వుండిన బంజరు భూములన్నిటి కొలత వేయించి, సాగు చేసుకునే రైతులకు దాన్ని వారి భూమి సాగు నిష్పత్తి ప్రకారం పంపకం చేయించాడు. ఇట్లా రైతుల స్వాధీనానికి వచ్చిన బంజరు భూములన్నిటికి కలిపి మక్తా పుల్లరి లేదా బీడు పన్ను చెల్లించాలని వుత్తర్వు చేశాడు.

అయితే ఈ విధానం కూడా రైతులకు మేలు చేయలేదు. అసలే ఆర్థికంగా చితికి పోయిన రైతులు ఈ మక్తా పుల్లరి చెల్లించలేక పోయారు. ఇంతలో 1806 సంవత్సరంలో నెల్లూరు జిల్లా భయంకరమైన కరువుకు గురయ్యింది. రైతుల బాధలు చెప్పనలవి కాదు. శిస్తు భారం మోయ లేకపోయారు. ప్రభుత్వం కూడా ఈ పరిస్థితి గ్రహించింది.

### *గ్రామ శిస్తు విధానం*

రైతుల బాధలు చూసిన కలెక్టర్ ట్రావెర్సీ తన తప్పు తెల్సుకొని, తాను ప్రవేశపెట్టిన రైత్‌వారీ మక్తా విధానం పూర్తిగా విఫలమైందని అర్థం చేసుకున్నాడు. రైతుల అనుకూలత కోసం ఆయన వెంటనే గ్రామ శిస్తు అనే నూతన విధానం ప్రవేశపెట్టాడు.

ఈ విధానం జిల్లాలో నవాబుల కాలంలో అమలులో వుండిన శిస్తు వసూలు విధానానికి అనుగుణమైనదని, భవిష్యత్తులో ప్రవేశపెట్ట దల్చిన శాశ్వత శిస్తు పద్ధతికి ఇది ప్రారంభ సూచికగా పనిచేస్తుందని భావించాడు ట్రావెర్సీ.

అయితే ఈ మార్పులు రైతులకు మేలు చేయకపోగా, గ్రామాలలో అల్లకల్లోలానికి దారి తీశాయి. 1808 నాటికి పల్లెటూళ్లలో పరిస్థితి కల్లోలభరితమై పోయింది. ఆ దశలో కలెక్టర్ ట్రావెర్సీ బదలీ అయి, ఆయన స్థానంలో ఫ్రాసర్ అనే నూతన అధికారి నియమితుడైనాడు. ఆయన 1809లో నెల్లూరుకు వచ్చాడు.

## అతిసార

8వ పేజీ తరువాయి

ఆర్థిక స్థితియం పట్ల సమగ్ర అవగాహన చేసుకొని ఈ నిధులను వెచ్చించాలన్నారు. మార్క్‌ఫెడ్ డైరక్టర్ చేవూరి విజయమోహన్‌రెడ్డి మాట్లాడుతూ త్వరలో గూడూరులో జిల్లా స్థాయి వాలీబాల్ పోటీలు నిర్వహిస్తామన్నారు. డిఎస్పీ జనార్దన్ మాట్లాడుతూ ప్రభుత్వ రంగ సంస్థల్లో క్రీడాకారులకు ప్రత్యేకంగా పోస్టులు కేటాయించినట్లే ప్రైవేట్ సంస్థలు కూడా కేటాయించాలన్నారు. ఆర్డీఓ సుబ్రహ్మణ్యం రెడ్డి, ఎమ్పీడిఓ సౌభాగ్యమ్మ, డాక్టర్ సి.ఆర్.రెడ్డి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

### జాతీయ బ్యాంక్‌ల స్థాయికి పినాకిని

జాతీయ బ్యాంక్‌ల స్థాయిలో వ్యాపార లావాదేవీలు నిర్వహిస్తూ, గ్రామీణ స్థాయిలో సేవలందించాలనే ధ్యేయంతో, పినాకిని గ్రామీణ బ్యాంక్‌లను నడిపిస్తున్నామని ఆ బ్యాంక్ ఛైర్మన్ శ్రీహరి ప్రసాద్ అన్నారు. ఉదయగిరి ప్రాంతంలోని ఆ బ్యాంక్ శాఖలలో దీర్ఘకాలిక పాత మొండి బకాయిల వసూలు నిమిత్తం గండిపాళెం శాఖకు వచ్చిన సందర్భంగా జమీన్‌రైతు విలేఖరితో మాట్లాడారు. గ్రామీణ ప్రాంతీయులకు సేవ చేయాలనే ఉద్దేశ్యంతో గ్రామీణ బ్యాంక్‌లను ఏర్పాటు చేశాం. కాలక్రమంలో రిజర్వ్ బ్యాంక్ నిబంధనలు, ఇతర బ్యాంక్ ఆర్థిక సంస్కరణల కారణంగా జాతీయ బ్యాంక్‌లతో పోటీ నేపథ్యంలో పంట, బంగారు, ఇతర రుణాలపై వడ్డీరేట్లు పెంచక తప్పలేదన్నారు.

నెల్లూరు - ప్రకాశం జిల్లాలకు విస్తరించివున్న పినాకిని బ్యాంక్ శాఖల ద్వారా ఈ నెలాఖరు నాటికి 210 కోట్లు డిపాజిట్లుగా సేకరించాలని లక్ష్యంగా పెట్టుకొన్నాం. ఇప్పటికి 200 కోట్లు సేకరించామని, అలాగే నాలుగు నెలల్లో 10లక్షలు మొండి బకాయిలు వసూలు చేశామన్నారు. జిల్లాలో పొదుపులక్ష్మి గ్రూపులకు ఆర్థిక పరిపుష్టి కలిగించేందుకుగాను 800 వందల గ్రూపులకు రుణ సదుపాయం కల్పించాలని లక్ష్యంగా పెట్టుకొని ఇప్పటికే 425 గ్రూపులకు రుణాలు అందజేయడం జరిగిందన్నారు. కేవలం 11తేది నాయుడుపేట శాఖ ద్వారా 60 గ్రూపులకు 20.60 లక్షలు పంపిణీ చేశామన్నారు. ఈ నెల 19వ తేది కొండాపురం బ్రాంచిలో 20 గ్రూపులకు రుణ సదుపాయం కల్పించమన్నారు. రుణాల వసూలు ఆశించిన రీతిలో ఉన్నందున, పంట రుణాలు, బంగారుపైన రుణాలు, ట్రాక్టర్లు, ఇళ్ల నిర్మాణానికి రుణాలు ఇవ్వదలిచామన్నారు. గండిపాళెం శాఖలో బ్యాంక్ ఆర్థిక సంవత్సరానికి 16లక్షల మొండి బకాయిలు వసూలు లక్ష్యం కాగా ఇప్పటికే 10లక్షలు వసూలు చేసామన్నారు. బకాయిల వసూలుకు సహకరించిన శాఖ మేనేజర్ జి. వెంకటేశ్వర్లును వారి సిబ్బందిని ఛైర్మన్ శ్రీహరిప్రసాద్ అభినందించారు. ఈ మొండి బకాయిల వసూళ్ల కార్యక్రమంలో ఏరియా మేనేజరు రామసుబ్బారావు, సీనియర్ మేనేజర్లు ఐ.వి.రెడ్డి, జి. వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.



ఎమ్మెల్యేల మధ్య జరిగిన స్పోర్ట్స్ అండ్ గేమ్స్‌లో విజేతగా నిల్చిన కావలి ఎమ్మెల్యే వేణుగోపాలరెడ్డికి బహుమతినందిస్తున్న ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు. ప్రక్కన స్పీకర్ ప్రతిభా భారతి.

## మల్లేశ్వరి

మొదటి పేజీ తరువాయి

చివరి నిమిషం వరకు సతాయించింది. కేవలం వారం రోజుల ముందు మాత్రమే మల్లేశ్వరి పేరుకు గ్రీన్‌సిగ్నల్ ఇచ్చారు మన అధికారులు. తాను ఆటలో పాల్గొనేది, లేనిది తెలియక మెంటల్ టెన్షన్ అనుభవించవలసిన పరిస్థితి మల్లేశ్వరి ఏకాగ్రతను దెబ్బతీసింది. లేకుంటే ఆమె బంగారు పతకమే గెల్చి వుండేది. ప్రభుత్వం సిగ్గుపడాల్సిన విషయమిది.

ఒలింపిక్స్ చరిత్రలో పతకం గెల్చుకున్న తొలి భారతీయ మహిళగా మల్లేశ్వరి పేరు దేశ ప్రజల హృదయాలలో చిరకాలం నిల్చిపోతుంది. ఆంధ్రుల దురదృష్టం - ఆమె వివాహం తర్వాత హర్యానా రాష్ట్రంలోని యమునానగర్‌లో స్థిరపడడం. ముఖ్యమంత్రి చంద్రబాబు మల్లేశ్వరిని ఒప్పించి, హైదరాబాదుకు రప్పించి యువతీ యువకులకు స్ఫూర్తినిచ్చే కార్యక్రమాలు నిర్వహింపచేయడం బాగుంటుంది. హర్యానా ప్రభుత్వం ఆమెకు 25లక్షల రూపాయల బహుమానం ప్రకటించింది; మన రాష్ట్రం అంతకంటే పెద్ద పారితోషికం ఇవ్వడం న్యాయం.

## బుల్లెట్

మొదటి పేజీ తరువాయి

నొక్కి పారేయగలిగాడు! అది ఆయన గెలుపూ కాదు; వారికి ఓటమీ కాబోదు.

విజ్ఞత కల్గిన రాజకీయవాదు లెవరైనా - ఒక పరిపాలనా పర అంశంలో ఇంతటి ప్రజా స్పందన వచ్చిన తర్వాత తమ తప్పు సర్దుకోవడం సహజం. ప్రతిపక్షాలను పట్టించుకోకుండా పరిపాలన చేయవచ్చుకాని; ప్రజలను, ప్రజాభిప్రాయాన్ని ప్రక్కకు తోసి ఏ ప్రభుత్వం కూడా బ్రతకలేదు. ఈ చారిత్రక సత్యాన్ని విస్మరించడం వల్లే చంద్రబాబు విద్యుత్ సమస్య సమసి పోయిందని సంతోషపడ గల్గుతున్నారు. నిజానికి అది ఎక్కడికి పోలేదు. రాజకీయ పార్టీల ఆందోళనల నుంచి, జనం మనసులలోకి ప్రవేశించింది. తమ మనసులోని మాటను బయటపెట్టే అవకాశం ప్రజలకు లభించింది బ్యాలెట్ పెట్టెల ద్వారా మాత్రమే; ఏదో ఒక ఎన్నిక జరిగే వరకు చంద్రబాబు తను సృష్టించుకొన్న పిచ్చివాళ్ల స్వర్గంలో సంతోషంగా గడపవచ్చు.

## నెల్లూరుముచ్చట్లు

6వ పేజీ తరువాయి

వేదపారాయణం, శ్రీదేవి భాగవత ప్రవచనం కూడా వుంటుంది. సాంస్కృతిక కార్యక్రమాల్లో యక్షగాన ప్రదర్శన, అన్నమయ్య కీర్తనలు ఏర్పాటయ్యాయి. ఉత్సవాలు వేడుక జరపాలని ధర్మకర్త సుందరరాజు, కార్యనిర్వహణాధికారి సాయిబాబా ప్రణాళికలు రచిస్తున్నారు.

### కోరిన పోస్టింగ్‌రాని ఎస్పీ

విశాఖపట్నం కమిషనర్ పోస్టింగ్ కోరుకున్న జిల్లా ఎస్పీ సి.వి. నరసయ్యకు చివరకు నిరాశే మిగిలింది. ఆయనను ఎక్సైజ్ అండ్ ప్రొహిబిషన్ శాఖ డైరక్టర్‌గా హైదరాబాద్‌లో నియమితులయ్యారు.

జిల్లా ఎస్పీగా నరసయ్య తనదైన ప్రత్యేక ముద్రతో పని చేయకపోయినా; అదృష్టం కలసి వచ్చి రకరకాలుగా బాగా గడించారు.

### మునిసిపల్‌కోఆప్షన్ఎన్నిక

గతంలో వాయిదాపడ్డ మునిసిపల్‌కో ఆప్షన్ సభ్యుల ఎన్నిక ఈ నెల 30తేది జరుగుతుంది. మారిన సమీకరణాలను దృష్టిలో వుంచుకొని కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలు తమ తమ అభ్యర్థుల గెలుపుకు వ్యూహం రచించుకొంటున్నాయి.

### వర్షం

17,20,21, తేదుల్లో టౌన్‌లో వర్షం పడింది. 17తేది మధ్యాహ్నం ఎక్కడా చోటు దొరకనట్లు హోటల్ శివప్రియ ప్రక్కన కొత్తగా కడుతున్న భవనంపై పిడుగుపడింది. అదృష్టవశాత్తు ప్రాణ నష్టమేమీ జరగలేదు.

* * *

# వెంకటగిరిలో నీటికి కట, కట

వెంకటగిరి ప్రాంతంలో వర్షం కురవకపోగా ఎండలు మండుతుండడం వల్ల నీటికై ప్రజలు కటకట లాడాల్సి వస్తుంది. వర్షా కాలంలో సైతం ప్రస్తుతం వెంకటగిరిలో వేసవి రోజులు తలం పునకు వస్తున్నాయి. చెరువుల్లో, వాగుల్లో, వంకల్లో చుక్క నీరు లేదు. నిమ్మతోటలు

## వర్షం కోసం ఎదురుచూపు!

ఎండు ముఖం పడుతున్నాయి. జూలై నెలలో కురిసిన తొలకరి జల్లులకు మోసపోయి రైతులు దుక్కి దున్ని అక్కడక్కడ వేరుశనగ, నువ్వు సాగు చేసి నీరు లేక పంట దెబ్బతినడంతో లబోదిబో మంటున్నారు. త్రాగునీటికి సైతం ప్రజలు కష్టపడాల్సి వస్తుంది. తెలుగు గంగ ద్వారా నీరు వెంకటగిరి మీదుగా చెన్నైకి పోతున్నా ఆపద కాలం లో సైతం వాడుకోని పరిస్థితులు నెలకొని వున్నాయి. అవసరానికి కాలువపై ఇంజన్లు పెట్టిన రైతులపై నీటిపారుదల శాఖాధికారులు కేసులు నమోదు చెడు తున్నారు. అసెంబ్లీలో ఎమ్మెల్యే రాజ్యల క్ష్మమ్మ నియోజకవర్గంలోని దైన్య పరిస్థితులు వివరించగా స్వర్ణముఖి నదికి, వాలగల మంద, చెంబేడు కాల్వలకు నీటిని విడుదల చేశారు. కైవల్యా నదికి, కయ్యూరు కాల్వలకు నీరు విడుదల చేసే అవకాశమున్నా పట్టించుకోలేదు. వీటికి లిఫ్ట్ ఇరిగేషన్ పద్ధతిలో నీటిని విడుదల చేస్తే కొద్దో గొప్పో నీటి సమస్య తీరుతుంది. ప్రభుత్వం వాస్తవ

తొరువ 11వ పేజీలో



పర్యాటక ప్రాంతాల పరిశీలనలో భాగంగా పులికాట్ సరస్సులో టూరిజం శాఖ సెక్రటరీ శ్రీమతి చందనాఖాన్, జిల్లాకలెక్టర్ ప్రదీప్‌కుమార్.

# తుస్సుమన్న ఆత్మకూరు ఫైరింజన్

ఫైర్ ఇంజన్లు మొరాయించడంతో ఆత్మకూరులో ఒక రైసు మిల్లు నిలువునా అగ్నికి ఆహుతయ్యింది. ఇక్కడి పంట వీధిలోని శ్రీలక్ష్మి ప్రసన్న రైసు మిల్లులో 17తేది రాత్రి విద్యుత్ షార్ట్ సర్క్యూట్ వల్ల మంటలు వ్యాపించాయి. మిల్లులో పనిచేసే కార్మికులు దగ్గరలో వున్న యజమానికి ఈ విషయం తెలియజేశారు.

## జిల్లావార్తలు

ఆయన హుటాహుటీన వచ్చి ఆత్మకూరు ఫైర్ స్టేషన్‌కు వేకువ జామున 3.30కు ఫోన్ చేశారు. కాని ఎంత సేపటికి ఫైర్ ఇంజన్ రాకపోవడంతో ప్రక్క ఇళ్లవాళ్లు తమ ఇళ్లకు మంటలు ఎక్కడ అంటుకొంటాయోనన్న భయంతో స్వయంగా ఫైర్ స్టేషన్‌కు వెళ్లారు. ఫైరింజన్ స్టారింగ్ ట్రబుల్ అని నెట్టమని అక్కడ పనిచేసే సిబ్బంది కోరగా అరగంట నెట్టినా ప్రయోజనం లేకుండా పోయింది. ఫైర్ స్టేషన్ నుంచి ఉదయగిరికి ఫోన్ చేయగా 5.45 ప్రాంతంలో ఫైరింజన్ వచ్చిందని కాని సాంకేతిక లోపం వల్ల దాని ట్యాంక్ నుంచి నీరు బయటకు చిమ్మలేదు. స్థానికులు కొందరు బిందెలతో నీళ్లుపోసి ప్రయత్నంలోనే రైసు మిల్లు బూడిదయ్యింది. మంటల్లో 80 పుట్ల ధాన్యం, 15 టన్నుల బియ్యం అగ్నికి నైవేద్యమయ్యాయి. మిల్లులోని ఇనుప స్తంభాలు సైతం కరిగి పోయాయి. 15 లక్షల మేర నష్టం జరిగినట్లు మాత్రం అగ్నిమాక శాఖాధికారులు నివేదిక తయారు చేశారు. ఆత్మకూరు, ఉదయగిరిలోని ఫైర్ స్టేషన్లు నామమాత్రమయ్యాయి. ఇక్కడి ఫైరింజన్లు పాతవి కావడంతో కదలక మొర్రో అంటున్నాయి. ఈ రెండు ఫైర్ స్టేషన్లను ఆధునీకరించాల్సి వుంది.

# శెట్టిగారికి కాంగ్రెస్‌లోనే గట్టిదెబ్బ!

కావలిలో కొందరు కాంగ్రెస్ కౌన్సి లర్లకు, మునిసిపల్ ఛైర్మన్ యానాదిశెట్టికి పొడగిట్టడం లేదు. 15వార్డు కౌన్సిలర్ సున్నా వెంకట్రావు జన్మభూమి కార్యక్రమంలో మునిసిపాలిటీకి జీపును బాడుగకు ఇచ్చి భారీగా నిధులు డ్రా చేసుకొన్నారన్న విషయమై కమీషనర్ ఆయనకు నోటీసులు జారీ చేశారు. వారం లోపల కౌన్సిలర్ సమాధానం ఇవ్వని పక్షంలో కమీషనర్, వెంకట్రావు పదవి రద్దు అవుతుందని ఇచ్చిన నోటీసుపై ఇటీవల జరిగిన మునిసిపల్ సమావేశంలో రెండు గంటల పాటు చర్చ జరిగింది.

సమావేశంలో 16 అంశాలతో కూడిన అజెండాలో 11వ అంశంగా వున్న నోటీసుపై కౌన్సిలర్ సున్నా వెంకట్రావు సభను స్థంబింప జేశారు. చట్ట విరుద్ధంగా, తనకు నోటీసు యిచ్చారని ఆయన నిలదీశారు. ఒక కౌన్సిలర్‌కు నోటీసు యిచ్చే అధికారం కమీషనర్‌కు లేదని, జిల్లా జడ్జికి వున్న అధికారాన్ని కమీషనర్ వుపయోగిం చారని, కౌన్సిల్ ఛైర్మన్ మరికొందరు కల్సి ఉద్దేశపూర్వకంగా తనకు నోటీసు యిచ్చారని అన్నారు. దీనికి స్పందించిన కమీషనర్ కె. కృష్ణారావు, తాను నిబంధనల మేరకే నోటీసు యిచ్చానని

## కావలి మున్సిపాలిటీలో రాజకీయ రంగుల రాట్నం

చెప్పడంతో, కౌన్సిలర్లకు కమీషనర్‌కు మధ్య వాదోపవాదాలు జరిగాయి. వెంటనే కౌన్సిలర్ వెంకట్రావు మున్సిపల్ చట్టా లను తెలియజేసే, న్యాయ గ్రంథాలను తీసుకొచ్చి, ఏ పుస్తకంలోని చట్టం ప్రకా రం నోటీసు యిచ్చారో చెప్పాలని, లేకుం టే కమీషనర్ క్షమాపణ చెప్పాలని కోరారు. దీనికి సమావేశంలోని మెజారిటీ కౌన్సిలర్లు ఆమోదం తెలిపారు. దీంతో కమీషనర్ కృష్ణారావు సభాముఖంగా నిబంధనల అతిక్రమణకు క్షమాపణ తెలి యజేశారు. సమావేశంలో వున్న ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి కలుగజేసుకొని మెజారిటీ కౌన్సిలర్ల అభీష్టం మేరకు, కౌన్సిలర్ సున్నా వెంకట్రావుపై ఎటు వంటి చర్య తీసుకోకూడదని ఈ విషయం మినిట్స్ పుస్తకంలో వ్రాయాలని కోరారు.

అయితే విచిత్రంగా ఇదే సమ యంలో మున్సిపల్ ఆఫీసు ఏరియాలో కరెంటు పోవడంతో సభ అర్థాంతరంగా ఆగిపోయింది. ఒక గంట అనంతరం కరెంటు వచ్చినప్పటికీ ఛైర్మన్ గ్రంధి యానాదిశెట్టి, వెంకట్రావుపై ఏ చర్య తీసుకోకూడదని వ్రాయడాన్ని వ్యతిరేకిం చారు. దీంతో సమావేశంలో తిరిగి గందర గోళ పరిస్థితులు నెలకొన్నాయి. ఛైర్మన్ యానాదిశెట్టి ఈ విషయంగా మినిట్స్

తొరువ 11 పేజీలో

# అతిసారవ్యాధిపై స్పందిస్తున్నాం

జిల్లాలో అతిసార, మెదడువాపు వ్యాధులు రాకుండా అన్ని రకాల చర్యలు తీసుకొంటున్నట్లు జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి ఎస్. మధుసూధన్ సింగ్ చెప్పారు. మేజర్, మైనర్ గ్రామ పంచాయ తీల్లో డ్రైనేజీలను వెంటనే శుభ్రపర్చమని, పందులను గ్రామాలకు 5 కిలోమీటర్ల దూరం తరలించమని జిల్లా పంచాయతీ

## జిల్లా వైద్య శాఖాధికారి

అధికారి ద్వారా కార్య నిర్వహణాధికార్లకు ఉత్తర్వులు పంపించినట్లు చెప్పారు. జిల్లా మలేరియా ఆఫీసులో జె.ఇ. ఎపిడమిక్ సెల్ ఏర్పాటు చేశారు. ఈ ఆఫీసు సిబ్బంది ప్రతిరోజూ అన్ని చిన్న పిల్లల ఆసుపత్రులలో నమోదైన జె.ఇ కేసుల సమాచారాన్ని జిల్లా వైద్య శాఖాధికారికి తెలియజేస్తారన్నారు.

1995 నుండి 1999 వరకు మెదడు వాపు వ్యాధిసోకిన వెంకటరెడ్డిపల్లి, గంగనపాళెం, కుడితిపల్లి, బంగారుపాళెం, ఉడతావారిపాళెం, వంగల్లు గ్రామాల్లో దోమల నిర్మూలన చర్యలు చేపడతారని వివరించారు. 15 సంవత్సరాల లోపు పిల్లలకు మెదడు వాపు వ్యాధి నిరోధక వ్యాక్సిన్, హోమియోపతి మందులు పంచుతామన్నారు. జిల్లాలో ఇప్పటి వరకు మెదడు వాపు వ్యాధి కేసులు నమోదు కాలేదని, మధుసూధన్ సింగ్ ధీమాగా చెప్పారు.

## స్టేడియం అభివృద్ధికి 15లక్షలు

గూడూరులోని అల్లూరు ఆదిశేష రెడ్డి స్టేడియం అభివృద్ధికి రాష్ట్ర ప్రభుత్వం 15లక్షలు మంజూరు చేసిందని ఎమ్మెల్యే బల్లి దుర్గాప్రసాద్ చెప్పారు. 16తేది మండల పరిషత్ ఆవరణలో జరిగిన క్రీడోత్సవ ముగింపు సభకు బహుమతి ప్రదాతగా ఎమ్మెల్యే హాజరై మాట్లాడారు.

తొరువ 7వ పేజీలో

# లంచాల మంచంపై రాపూరు ఎస్.ఐ.

రాపూరు ఎస్ఐ లంచమిస్తే ఎంత పెద్ద కేసైనా మాఫీ చేసేస్తున్నారు. చిన్న చిన్న కొట్లాటలు, అత్యాచారం, హత్యాయత్నం, వరకట్న కేసులైనా వేటికీ ఎస్ఐ కేసులు కట్టడం లేదు. కేసులు పెట్టుకోను వచ్చిన ఇరువర్గాలను కూర్చోబెట్టి తన బేరం కుదుర్చుకొం టున్నారు. కేసును బట్టి ఎస్ఐకి లంచ మిస్తే అవి మాఫీ అయిపోతు న్నాయి. రాపూరుకు కొత్త ఎస్ఐ వచ్చింది మొదలు పట్టుమని పది కేసులు కూడా ఎఫ్ఐఆర్ కట్టలేదు. కేసుల రాజీలో పొందిన మొత్తాన్ని 75శాతం ఎస్ఐ, మిగతా 25శాతం సిబ్బందికి పంచడంతో వాళ్లు సైతం సంతోషంగా వున్నారు. నెల్లూరు టూ టౌన్ ఎస్ఐగా గతంలో ఈ ఎస్ఐ పనిచేసిన హయాంలోను ఇదే విధంగా కేసులు మాఫీ చేస్తూ బాగా గడించారన్న పేరుంది. రాపూరు ఎస్ఐ పని తీరును అధికారులు పరిశీలించాల్సి వుంది.

## విద్యుత్ ఛార్జీలను వ్యతిరేకిస్తూ ర్యాలీ

రాష్ట్ర ప్రభుత్వం పెంచిన విద్యుత్ ఛార్జీలను వ్యతిరేకిస్తూ గూడూరు డివిజన్ భవన నిర్మాణ కార్మిక సంఘం, సిఐటియు నేతృత్వంలో 18తేది భారీ ర్యాలీ జరిగింది. వందల సంఖ్యలో కార్మికులు ఇందులో పాల్గొన్నారు. ర్యాలీ నిర్వాహకులు ఆర్డీఓకు వినతి పత్రం ఇవ్వను పోగా అక్కడ వెంకటగిరి

## ఇరువర్గాలతో 'రాజీ'ల బేరం

తెలుగుదేశం పార్టీ ఇన్‌ఛార్జి శారద కనిపించారు. ర్యాలీ నిర్వాహకులు ఆమెను విద్యుత్ ఛార్జీల పెంపకంపై మీ వైఖరి తెలియజేయమనగా తాను గతంలో కమ్యూనిస్టు కార్యకర్తనని చెప్పి కారెక్కి వెళ్లిపోయారు. కార్మిక సంఘం, సిఐటియు నాయకులు జనార్ధనరెడ్డి, ఎ.మస్తానయ్య, టి.వి. రమణయ్య, ఎన్. రామాచారి, పుట్టా శంకరయ్య, ఎస్. శేఖరాచారి, షేక్ చాన్‌బాష ప్రదర్శనకు నాయకత్వం వహించారు.

## సర్పంచ్‌ల చెక్‌పవర్ రద్దుకాలేదు!

సర్పంచ్‌ల చెక్ పవర్ రద్దుకాలేదని రాష్ట్ర సర్పంచ్‌ల సంఘం అధ్యక్షుడు వై. బాబూరాజేంద్రప్రసాద్ చెప్పారు. సర్పంచ్‌ల పదవీకాలం ముగుస్తున్న దృష్ట్యా సర్పంచ్‌ల చెక్ పవర్‌ను రాష్ట్ర ప్రభుత్వం తీసివేస్తూ ఉత్తర్వు ఏమీ జారీ చేయలేదన్నారు. సర్పంచ్‌ల చెక్ పవర్ పూర్తి అధికారాలతో కొత్త పాలక వర్గాలు పదవి బాధ్యతలు స్వీకరించే వరకు ఉంటుందని స్పష్టం చేశారు.

## జక్కా రంగారెడ్డి సంతాపసభ

రైతు నాయకుడు జక్కా రంగారెడ్డి సంతాప సభ 28తేది జగదేవిపేటలో జరుగుతుంది. పార్లమెంటు, శాసనసభ్యు లతో పాటు రైతు నాయకులు పాల్గొనే సభకు రైతులు హాజరు కావాలని జిల్లా రైతు సంఘం అధ్యక్షుడు గునుపాటి రామచంద్రయ్య కోరుతున్నారు. *

# పులుపు తినకే నా పిచ్చితల్లీ!

నగ్మా చెల్లెలు జ్యోతిక ప్రతి విషయాన్ని కుండ బద్దలు కొట్టినట్లు మాట్లాడుతుంది. చిత్ర పరిశ్రమలో మన ఇష్టాయిష్టాల ప్రకారం నడుచుకోవడానికి వీలుండదని చెప్పింది. నాకు పుల్లగా

## జ్యోతికకు తల్లి సలహా

వుండే మామిడిపళ్లు తినడమంటే చాలా ఇష్టం. ఈ మధ్య షూటింగ్ జరుగుతుండగా యూనిట్‌లో ఒకరు పుల్లని పచ్చి మామిడి కాయ తెచ్చి ఇచ్చారు. దీన్ని తింటుండగా మా అమ్మవచ్చి దాన్ని పెరుక్కొంది. ఇలా పులుపు తినడం ఏ పేపర్‌లోనైనా చూసివుంటే కొంప మునిగేదని చీవాట్లు పెట్టిందని వాపోయింది. ఈ మధ్య లిటిల్ జాన్ అనే హాలీవుడ్ చిత్రంలో బుక్ అయిన జ్యోతిక ఆ చిత్ర హీరో లిటిల్ జాన్‌తో క్లోజ్‌గా వుందట. దీనికి మామిడి కాయలకు ఏదైనా లింకు వుందా?

## డింపుల్ కొవ్వొత్తులకు భలే డిమాండ్

డింపుల్ కపాడియా కొత్తరకం కొవ్వొత్తుల తయారీలో బిజీగా వుంది. గత కొంతకాలంగా కొవ్వొత్తుల కుటీర పరిశ్రమని నిర్వహిస్తూ వస్తున్న డింపుల్ అందులో రకరకాల ప్రయోగాలు చేసి పేరు తెచ్చుకొంది. డింపుల్ కొవ్వొత్తులకు ఒక ప్రత్యేకత వుంది. మామూలు

తరువాయి 11వ పేజీలో



శ్రీ వెంకటరమణ ప్రొడక్షన్స్ చిత్రంలో ఆషాసైనీ, సిమ్రాన్.

# ముడతల మడత పేజీ

తెలుగు, తమిళ, హిందీ భాషల్లో యాభైకిపైగా చిత్రాల్లో నటించిన నగ్మాకు ఇంకా నటించాలన్న కోరిక ఎక్కువగానే వుంది. ఇందులో భాగంగానే బాగా సన్నబడి స్లిమ్‌గా తయారయ్యింది. నిర్మాతల వద్దకు వెళ్లిసినిమాల్లో వేషాలిమ్మంటే ముఖంపై ముడతలు చూసుకొన్నావా అని ముఖానే అడిగేస్తున్నారట. నాకన్నా వయస్సు ఎక్కువగా వుండే వాళ్లు హీరోయిన్లుగా నటిస్తుంటే నాముఖంపై

## నగ్మాకు నగుబాటు

ముడతలు పడ్డాయంటారా అంటూ నిర్మాతలపై ధుమ ధుమ లాడుతుంది.

## డాక్టరేట్ మిస్సయిన కుష్బూ

తమిళ ప్రజల ఆరాధ్యనటి కుష్బూకు అమెరికాలోని ఓ యూనివర్సిటీ వారు గౌరవ డాక్టరేట్‌ను ప్రకటించారు. కాని దాన్ని అందుకోను కుష్బూ అమెరికా వెళ్లలేదు. కారణమడిగితే గర్వంతో అమెరికా ఎలా వెళతానని ఎదురు ప్రశ్నించింది. అసలు విషయం ఆరాతీస్తే -డాక్టరేట్ ఇస్తామన్న యూనివర్సిటీ వారు రానుపోను ఖర్చుల్ని ఆమెనే పెట్టుకొని రమ్మన్నారట. దీంతోఖర్చుల్ని లెక్కవేసి తడిసిమోపెడవుతున్నాయని ఊరుకొందట. మెత్తానికి కుష్బూకు డాక్టరేట్ మిస్సయ్యింది.

## ఆదర్శ భావాల కౌసల్య

హీరోయిన్ కౌసల్యకు సనాతన భావాలంటే అయిష్టం. ఇప్పుడు రాహుకాలం షూటింగ్‌కు బయలుదేరక కాసేపు ఆగు అని ఇంట్లోని వారంటే ఖచ్చితంగా ఆ టైమ్‌లోనే బయలు దేరుతుందట. పిల్లి ఎదురొచ్చింది, కాసేపు ఆగి వెళదాం మేడమ్ అని అంటే - "కౌసల్య ఎదురొచ్చింది ఏ మవుతుందోనని పిల్లి అనుకొంటే ఎలా" అని ఆమె ఎదురు ప్రశ్నిస్తుందట.

# కరిష్మాకు కళ్యాణ ఘడియ

కరిష్మాకపూర్ ఈ మధ్య ఓ సాయం సంధ్య వేళ ముంబాయిలో టాప్ జ్యూయలరీ షాప్‌కి వెళ్లింది. హీరోయిన్లు జ్యూయలరీ షాప్స్‌కి వెళ్లడం మామూలు విషయమే. కానీ కరిష్మా మాత్రం తన ఇంట్లో వాళ్లకు కానీ, తన ఫ్రెండ్స్‌కి కానీ ఎవరికీ చెప్పకుండా బంగారు షాపుకు వెళ్లింది. తనకు కావాల్సిన




వస్త్రువులు తానే ఆర్డర్ చేసుకొని ఆపై ఏమీ ఎరగనట్లు వచ్చేసింది. సంగతేమిటని అడిగితే త్వరలో తాను పెళ్లి కూతురవుతున్నట్లు శుభవార్త చల్లగా చెప్పింది.

## ట్వింకిల్ హుషారు

బాలీవుడ్‌లో కథానాయికగా కొనసాగాలంటే హుషారుగా పని చేయగలగాలంటుంది హీరోయిన్ ట్వింకిల్ ఖన్నా. పనితనంతో నిర్మాతలు, దర్శకులను ఆకర్షించి నప్పుడే అవకాశాలు వస్తాయంటుంది. షూటింగ్ సమయంలోనూ ట్వింకిల్ పని..... పని.... అంటూ రేసు గుర్రంలాగా పరుగెడుతుందట. నటనలతో పాటు అన్ని విషయాల్లో ట్వింకిల్ పరిణతి సాధించినట్లు దర్శక, నిర్మాతలు చెబుతున్నారు. ట్వింకిల్ హుషారు వల్ల ఐదారు చిత్రాలు ప్రస్తుతం ఆమె చేతిలో వున్నాయి.

## నాపై అంచనాలు వద్దు

తనపై స్థాయికిమించిన అంచనాలు పెట్టుకోవద్దంటున్నాడు కహోనా ప్యార్ హై హీరో హృతిక్ రోషన్. నా తదుపరి చిత్రం ఏదైనా సరే ఇలా వుంటుంది;ఇలా వుంటుందని ఎక్స్‌పెక్ట్ చేయవద్దు. అందరికీ నచ్చేలానే నా చిత్రాలు వుంటాయి. భవిష్యత్తులోనూ నా చిత్రాలు ఆ విధంగా వుండడానికి నా వంతు ప్రయత్నం నేను చేస్తాను. ఇమేజ్ చక్రంలోకి ఇప్పుడిప్పుడే లాగొద్దు;

తరువాయి 11వ పేజీలో

# అందాల విందుల్లో తారల చిందులు

అందాలను వెండి తెరపై ఆరబోయడంలో మొదటిస్థానం నాదంటే నాదేనంటూ సంఘవి - వింధ్య సిగ్గు విడిచి జుట్లు పట్టుకుంటున్నారు. తెలుగులో గ్లామర్ హీరోయిన్ అయిన సంఘవికి తమిళంలోనూ ఇదే రకమైన మార్కెట్ వుంది. తమిళ చిత్రాల్లో ఎక్స్‌పోజింగ్‌లో సంఘవి - వింధ్యలు పోటీ పడుతుంటారు. ఈ నేపథ్యంలో ఇద్దరికీ ఈ మధ్య రేగిన చిన్నపాటి ఘర్షణ సవాళ్లు కూడా విసురుకొనే స్థాయి వరకు వెళ్లింది. `ఎస్ పురుషన్ కుళంద్రై మాదిరి' చిత్రంలో నేను వెండితెర దిమ్మెర పోయేలా గ్లామర్‌ను వెదజల్లబోతున్నాను. ఈ గ్లామర్‌ను చూసి ప్రేక్షకులు థియేటర్‌ను వదలనే వదరని వింధ్య ఛాలెంజ్ చేసింది. దీనికి ప్రతిగా నా వంటి విరుపు ఒకటి చాలు వింధ్య ఎన్ని చూపించినా తన ముందు దిగదుడుపవుతుందని సంఘవి ప్రతి సవాల్

## జుట్లు పట్టుకుంటున్న సంఘవి - వింధ్య

చేసింది. నటన సంగతి గాలికొదిలేసి అర్ధనగ్న ప్రదర్శన కోసం సెన్సార్ అనుమతి ఇస్తే ఏకంగా నగ్న ప్రదర్శన కోసం పోటీ పడుతున్న ఈ దగుల్బాజీ హీరోయిన్లను ఏమనాలో అర్ధం కావడం లేదు.చూపిస్తామని ఇద్దరు హీరోయిన్లు శపథాలు చేస్తుంటే సెన్సార్ బోర్డు ఏం చేస్తుందబ్బా?

## కోపంరాని హీరో

హిందీ హీరో అనిల్‌కపూర్‌కు కోపం అసలు రాదట. ఆయన్ను కోపంగా చూడాలంటే సినిమాలో చూడాల్సిందే గానీ బయట మన వల్ల కాదంటున్నారు సహనటుడు అనుపమ్ ఖేర్. ఆయన కనీసంగానైనా కోపాన్ని ప్రదర్శిస్తాడేమోనని ఎన్నోమార్లు షూటింగుల్లోవెకిలి జోక్స్ వేసినా చిరునవ్వే ముఖంలో కనిపిస్తుందని చెప్పారు. అందువల్లనే హిందీ పరిశ్రమలో అనిల్ కపూర్‌ను ముద్దుగా కూల్ కపూర్ అని పిలుస్తారు.

# 'నిన్నే ప్రేమిస్తా'లో ప్రేమ గుభాళింపు

తమిళభాషలో విజయవంతమైన చిత్రాల ఆధారంగా తెలుగులో చిత్రాలు నిర్మించి విజయం సాధించటంలో మొనగాడనిపించుకున్నాడుఆర్.బి.చౌదరి. ఆయన `నీవారు వాయెన' తమిళ చిత్రం పునాదుల మీద తెలుగులో "నిన్నే ప్రేమిస్తా", చిత్రం నిర్మించాడు. చిత్రం పేరే చెప్తుంది. ఇది ఒక ప్రేమకథా చిత్రమని. ప్రేమకథలు తెలుగు చిత్రాలకు కొత్తేమీ కాదు. ఈ పాత అంశాన్ని, దర్శకుడు పిండే నేర్పయిన తన ఊహా విధానంతో సన్నివేశాల బలం పెంచి కొత్త స్వరూప స్వభావాలను కూర్చి ఆకర్షణీయం చేశాడు. ప్రేమకు ఒక పవిత్రమైన అర్ధాన్ని ఆదర్శవంతమైన పరమార్థాన్ని తెలిపాడు. ప్రేమ కథ పాత ధోరణి చుట్టూ మాటు వేసి తన పదునైన ఆలోచనలతో కథనానికి చురుకైన కదలికలు ఏర్పరిచాడు. ఆ కదలికల్లో తాజాదనాన్ని గుబాళింపజేసి ప్రేక్షకుల ఆదరాభిమానాలు కొల్లగొట్టే తెలివి తేటలు తనలో కోకొల్లలుగా వున్నాయని రుజువు చేశాడు. ప్రేమ కథకు, వినోదాన్ని, సెంటిమెంటును మేళవించి మెరుగుపరిచాడు. ప్రముఖ హీరోలు ముగ్గురు నాగార్జున, శ్రీకాంత్, రాజేంద్రప్రసాద్ ఈ చిత్రంలో నటించారు. శ్రీకాంత్ హీరోగా, నాగార్జున ఒక ప్రత్యేక పాత్రలో, రాజేంద్ర ప్రసాద్ కీలకమైన పాత్రలో స్థానాలు కల్పించుకున్నారు. సౌందర్య కథానాయికగా ప్రేమకు, త్యాగానికి సయోధ్యత ఏర్పర్చుకొంది. ఈ నలుగురు పోషించిన పాత్రలు ప్రాధాన్యతను సంతరించుకొని ప్రేమకు ఊపిరి పోస్తాయి. త్యాగానికి రూపం ఏర్పరుస్తాయి. దీనికి వారి మనస్తత్వాల్లోని సునిశితమైన శైలి సమాధానం చెప్తుంది.

శ్రీకాంత్ నటించిన పాత్ర పేరు కళ్యాణ్, ఇతను బ్యాంకు మేనేజరుగా




పనిచేస్తుంటాడు. తాను ప్రేమించి పెళ్లిచేసుకోవాలనుకున్న అమ్మాయి ఎక్కడో పుట్టి పెరుగుతూ వుంటుందని, ఆమె కోసం తాను వెతకనవసరం లేదని, ఆ ప్రేమ దేవత తటస్థపడినప్పుడే ఆమెకు తన ప్రేమను వెల్లడించి, పెళ్లి చేసుకుంటాను అనే ఒక ఖచ్చితమైన అభిప్రాయాన్ని ఏర్పర్చుకొని వుంటాడు.

రాజేంద్రప్రసాద్ పోషించిన పాత్ర పేరు రమేష్. ఇతను కళ్యాణ్ సహోద్యోగి. ఇతనికి ప్రేమంటే ఎంతో ఇష్టం. ప్రేమికులంటే ఇంకా ఎంతో ఇష్టం. ప్రేమికుల ప్రేమ ఫలించివారు సుఖంగా వుండాలని ఆశపడే వ్యక్తి. ప్రేమ విజయం కోసం ఇతను కృషి చేస్తుంటాడు. కాని ఇతను ప్రేమిం చేందుకు ఎవ్వరూ ఎదురుపడరు.

శ్రీకాంత్‌కు వేరే ఊరు బదలీ అవుతుంది. ఆ ఊర్లో మేఘమాల (సౌందర్య) ఇంట్లో బాడుగకు చేరతాడు. తన జీవితంలో స్థానం కోసం పుట్టి పెరిగిన దేవత ఈమేనని కళ్యాణ్, మేఘమాలను ప్రేమిస్తాడు. మేఘమాలతో "నిన్నే ప్రేమిస్తా" నంటాడు.

నాగార్జున పోషించిన ప్రత్యేకమైన పాత్రపేరు శ్రీనివాస్. ధైర్య సాహసాలతో బార్డరులో మిలటరీ ఆఫీసర్‌గా వుంటాడు. మిలటరీలో కఠినంగా వున్నా మామూలు సమయాల్లో నవ్వుతూ సరదాగా వుంటాడు. మేఘమాల మీద మనసు నిలుపుకొంటాడు. "నిన్నే ప్రేమిస్తా" నంటాడు.

మేఘమాల మనిషి ఎంత అందమో, మనసూ అంత సుందరం. ఆమె సుందర రూపంపై కళ్యాణ్, శ్రీనివాస్ ప్రేమ పుష్పాలు వెదజల్లుతారు. శ్రీనివాస్ తరచు అమె మనసులో కలక

తరువాయి 11వ పేజీలో

# వారఫలాలు

*23-9-2000తేది నుండి 29-9-2000తేది వరకు వృషభంలో గురు, శనులు; మిధునంలో రాహువు; సింహంలో కుజుడు; కన్యలో రవి; తులలో బుధ, శుక్రులు; ధనుస్సులో కేతువు; కర్కాటక, సింహ, కన్యలలో చంద్రుడు.*



## మేషం

(అశ్విని, భరణి, కృత్తిక 1వ పాదం)

అనుకున్న పనులు సక్రమంగా జరుగుతాయి. వృత్తి, వ్యాపార, పారిశ్రామిక రంగాలలో ఆదాయం బాగుంటుంది. సోదరవర్గానికి అభివృద్ధి ఉంటుంది. పిల్లలకు కొద్ది అనారోగ్యముండి సర్దుకొంటుంది. వ్యాపార పెట్టుబడి వర్గాలు తమ పనులను వృద్ధి చేసుకొంటారు. అధికార యంత్రాంగం సహకారం బాగుండి ఉద్యోగులు మంచి సమర్థతను చూపుతారు. శిరస్సు, నరముల రుగ్మతలుంటాయి. వారాంతంలో శుభవార్తలు వింటారు.

## వృషభం



(కృత్తిక2,3,4పాదాలు, రోహిణి, మృగశిర 1,2 పాదాలు)

ఆరోగ్యం సరిగా ఉండదు. శిరస్సంబంధిత రుగ్మతలు బాధపెట్టగలవు. ఆర్థికస్థితి బాగుంటుంది. వ్యాపార విస్తరణ, పెట్టుబడి రంగాలకు అవకాశాలు వస్తాయి. కుటుంబ సభ్యులకు వారాంతంలో ఆరోగ్యం సరిగా ఉండదు. పిల్లల విద్యావృద్ధి బాగుంటుంది. బంధుమిత్రుల రాకపోకలు, వస్త్ర వాహనాలుకొనే ప్రయత్నాలు జరుగుతాయి. సొంత పనులు, ఉద్యోగపరంగా పనులు చక్కగా నిర్వహిస్తారు.



## మిధునం

(మృగశిర3,4పాదాలు, ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పాదాలు)

ఆశించిన ఆదాయం లభించక పోగా అనుకోని ఖర్చులు పైనబడగలవు. బంధువులను కలుసుకుంటారు. ఉద్యోగ నిర్వహణలో పొరపాట్లు జరుగకుండా జాగ్రత్తపడాలి. అధికార వర్గాల వేధింపులుండవచ్చును. పనులు సక్రమంగా జరగక మనస్తిమితం ఉండదు. కుటుంబ సభ్యుల అనుకూలత బాగుంటుంది. శుభకార్య నిర్ణయాలు జరుగవచ్చు. బంధుమిత్రులతో విభేదాలు రావచ్చును.



## కర్కాటకం

(పునర్వసు 4 పాదం, పుష్య, ఆశ్రేషలు)

వ్యవసాయ, వ్యాపార రంగాల వారికి అభివృద్ధి బాగుంటుంది. వాణిజ్యపరంగా రాబడి పెరగడానికి ప్రయత్నాలు చేస్తారు. అనుకున్న పనులు సవ్యంగా జరిగిపోతాయి. రావలసిన బాకీలు కొంత వరకు లభిస్తాయి. మీ మాట తీరును ఇతరులు అపార్థం చేసుకొనవచ్చును. వారాంతంలో ప్రయాణాలు, స్థిరాస్తులు గాని, వాహనాలుగాని, నూతన వస్తువులు గాని కొనడం, ఇతరులకు జరిగిన శుభవార్తలు వినడం జరుగుతుంది.



## సింహం

(మఖ; పుబ్బ; ఉత్తర 1వ పాదం)

ఆదాయ, వ్యయాలు సమానంగా ఉంటాయి. ఎంత శ్రమపడినా అదనపు ఆదాయం నిలవదు. నూతన వ్యాపార ప్రారంభ ఖర్చులు, పెట్టుబడులకు మంచి అవకాశాలు లభిస్తాయి. కన్ను, చెవి, రక్తం సంబంధిత అనారోగ్యం ఉంటుంది. ఉద్యోగ నిర్వహణలో పొరపాట్లు రాకుండా జాగ్రత్తపడాలి. అధికార వర్గాన్ని గమనించుకోవాలి. పాత కేసులు, వ్యవహారాలు అనుకూలంగా ఫలితం నిస్తాయి. సాహిత్య, సాంస్కృతిక రంగాల వారికి ఆదరణ ఉంటుంది. విద్యార్థులకు అభివృద్ధి బాగుంటుంది. కుటుంబ సౌఖ్యం బాగుంటుంది. నూతన ఉద్యోగ ప్రయత్నాలు, సంప్రదింపులు జరుగుతాయి.



## కన్య

(ఉత్తర2,3,4పాదాలు; హస్త;చిత్త1,2పాదాలు)

కుటుంబ సభ్యుల వైద్య ఖర్చులు పెరుగుతాయి. ఆదాయం బాగుంటుంది. కొన్ని ముఖ్య ఆర్థిక విషయాలలో సన్నిహితుల వల్ల చిక్కులలో పడతారు. పలుకుబడి, గౌరవం బాగుంటుంది.



## పంచాంగం

తేది 27 బుధవారం మహాలయ అమావాస్య. తేది 28 గురువారం శరన్నవరాత్రారంభం.

సెప్టెంబరు తిథులు
భాద్రపద బహుళ

తేది 23శని దశమి ఉ11.40గం.వ
తేది 24ఆది ఏకాదశి ఉ9.15గం.వ
తేది 25సోమ ద్వాదశి ఉ7.00గం.వ
త్రయోదశి రా 4.50 గం.వ
తేది26మంగ చతుర్దశిరా2.45గం.వ
తేది 27బుధ అమావాస్య
రా 12.15 గం.వ

ఆశ్వయుజ శుక్ల
తేది28బేస్త పాడ్యమిరా12.00గం.వ
తేది 29శుక్ర విదియ రా11.20గం.వ

స్వయంపాకుల శ్రీనివాసులు, ఎం.ఏ.



రావలసిన బాకీలు నిలబడిపోతాయి. ఈ రాశి వారికి ఆదాయం ఖర్చు సమానంగా ఉంటుంది. ఉపాధి అవకాశాలు లభిస్తాయి.



## తుల

(చిత్ర 3,4పాదాలు, స్వాతి, విశాఖ1, 2, 3 పాదాలు)

ఆర్థిక పరిస్థితి సుమారుగా ఉంటుంది. బిడ్డల వల్ల, అనారోగ్య కారణాల వల్ల ఖర్చులు పెరుగుతాయి. తల్లితండ్రి వర్గ బంధువుల అనారోగ్య వార్తలు వింటారు. ఉద్యోగ నిర్వహణలో చిన్న పొరపాట్లు దొర్లవచ్చు. బంధుమిత్రులకు ఆర్థికంగా సహాయపడతారు. వ్యవసాయ, వ్యాపార రంగాలలో డబ్బు అవసరం పెరుగుతుంది. ఇష్టంలేని ప్రయాణాలు, అయిష్టంగా కొన్ని విషయాలను అంగీకరించడం, వస్తు నష్టం కలుగుతుంది.



## వృశ్చికం

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వ్యాపార రంగంలో కొన్ని ఇబ్బందులు, అధికారుల వేధింపులు ఉండవచ్చును. ఆశించినంత ఆదాయం ఉండదు. ముఖ్య బంధువర్గ సభ్యులకు అనారోగ్యం కలుగుతుంది. ఇతరులకు మాట రూపేణ డబ్బు రూపేణ సహాయపడతారు. ఉద్యోగులకు అధికారుల సహకారం బాగుంటుంది. రావలసిన బాకీలు కొంత వరకు లభిస్తాయి. రాజకీయ, సాంస్కృతిక రంగాల వారికి పలుకుబడి అవకాశాలు బాగుండును. భార్యాభర్తలలో ఒకరికి అనారోగ్యం.



## ధనుస్సు

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పాదం)

కుటుంబ, ఉద్యోగ సమస్యలు పరిష్కారానికి వస్తాయి. ఆర్థికస్థితి బాగుంటుంది. వారాంతంలో అనుకోని ఖర్చులు పైనబడగలవు. కొత్త వ్యాపార ప్రారంభాలకు, పెట్టుబడులకు ప్రయత్నాలు చేస్తారు. నిరుద్యోగులకు అవకాశాలు, ఉద్యోగులకు పదోన్నతి, రాజకీయ వర్గాల బలం పెరగడం, సాహిత్య, సాంస్కృతిక రంగాల వారికి ఆహ్వానాలుంటాయి. వారాంతంలో ప్రముఖులతో పరిచయాలు, దైవ కార్యాలలో పాల్గొనడం జరుగుతుంది. కుటుంబ సౌఖ్యం, విద్యాప్రగతి బాగుంటుంది. పాత కేసులు, వ్యవహారాలు రాజీకి వస్తాయి.



## మకరం

(ఉత్తరాషాఢ 2,3,4 పాదాలు, శ్రవణ, ధనిష్ఠ 1,2 పాదాలు)

మనసు ఆందోళనగా ఉంటుంది. పనులు సరిగా జరుగక ఇబ్బంది పెట్టగలవు. వృత్తి, వ్యాపార, వ్యవసాయ రంగాలలో ఆదాయం బాగుంటుంది. ప్రభుత్వపరంగా, మిత్రుల వల్ల సహాయం పొందుతారు. రుణాలు లభ్యం కాగలవు. అధికారిక ప్రయాణాలుంటాయి. అధికార వర్గాల మద్దతుతో మీ బాధ్యతలు నిర్వర్తిస్తారు. ఉద్యోగావకాశాలు లభిస్తాయి.



## కుంభం

(ధనిష్ఠ 3,4 పాదాలు, శతభిష, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

వ్యాపారపరంగా విస్తరణకు మంచి అవకాశాలు వస్తాయి. ఈ రాశి వారికి సామాన్య ఆదాయానికి లోపం లేదు. ఒకటి, రెండు అదనపు అనవసర ఖర్చులు తగులగలవు. స్థిరాస్తుల క్రయవిక్రయాలకు రేటు రావచ్చును. సాంకేతిక విద్యా రంగాల వారికి ఉద్యోగ లాభం ఉంటుంది.



## మీనం

(పూర్వాభాద్ర 4పాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఆరోగ్య రీత్యా బాగుండదు. బంధువర్గాలకు జరిగిన నష్టవార్తలు, అనారోగ్యవార్తలు తెలుస్తాయి. ఉద్యోగ నిర్వహణలో శ్రమ ఎక్కువగా ఉంటుంది. చిన్న విషయాలు మనస్పర్థలను కలిగిస్తాయి. సొంత పనులు ఉద్యోగ పరమైన పనులు నిదానంగా జరుగుతాయి. అవసరాలకు అప్పు కూడా చేయవచ్చును.

# జనవాణి

3వ పేజీ కొరవ

విజ్ఞతకే వదలి పెట్టారు. దీనిని ఆసరగా చేసుకొని రాజకీయ పక్షాలు మైనారిటీల బుజ్జగింపులో పడిపోయాయి. రాజ్యాంగ నిర్మాతలు చేసిన కామన్ సివిల్ కోడ్ సూచననే ప్రక్కన పడేశారు.

*గూడూరు* *వి.వి.ప్రసాద్*

## నిరుద్యోగుల గతిఏమిటి?

ప్రభుత్వ ఉద్యోగాలు గగనకుసుమాలైన పరిస్థితుల్లో కాని ఆదుకొంటాయని ఆశపడ్డ స్వయం ఉపాధి పథకాలు నిరుద్యోగులను ఆదుకోవడం లేదు. బ్యాంకుల నిర్లక్ష్యం, పథకాల అమలులో వైఫల్యం నిరుద్యోగులను కుంగదీస్తున్నాయి. ఉద్యోగావకాశాల కల్పనకు అవకాశాలు పూర్తిగా మృగ్యమవుతున్న దశలో ప్రభుత్వాలు వివిధ స్వయం ఉపాధి పథకాలను ప్రకటిస్తున్నప్పటికీ, వీటి అమలు బ్యాంకుల దయా దాక్షిణ్యాలపైనే ఆధారపడి వుంది. మొత్తం మీద స్వయం ఉపాధి పథకాల అమలులో ప్రభుత్వాల వైఫల్యం, బ్యాంకు నిర్లక్ష్యం మొత్తంగా నిరుద్యోగులకు దిక్కుతోచని పరిస్థితిని కల్పిస్తున్నాయి.

*నెల్లూరు* *వి.వేణుగోపాల్*



## రైతులంటే లెక్కలేని ప్రభుత్వం

ప్రభుత్వ విద్యుత్ విధానం లోపభూయిష్టంగా వుంది. ముఖ్యంగా రైతాంగం తెలుగుదేశం ప్రభుత్వ విధానాల వల్ల నష్టపోతున్నారు. రైతులకు రోజుకు 9గంటలే మూడు ఫేసుల కరెంట్ ఇవ్వడం వల్ల వ్యవసాయం చేయలేక పోతున్నారు. ముందే గిట్టుబాటు ధరలు లేక, పెట్టుబడికి గ్యారంటీ లేక రైతులు నష్టపోయి ఆత్మహత్యలు చేసుకొంటున్నారు. అనంతపురం జిల్లాలో వేరుశనగ పండించిన రైతులు దిక్కుతోచక ప్రభుత్వం తెగుళ్ల నివారణకు ఇచ్చిన మోనోక్రోటోపాస్ తాగి ఆత్మహత్యలకు పాల్పడ్డారు. జిల్లాలో వరి పండించడం గిట్టుబాటుగాక రొయ్యల పరిశ్రమ వైపు కొందరు వెళ్తే విద్యుత్ కనెక్షన్ల విషయంలో ట్రాన్స్‌కో అధికారులు కొత్త చట్టాల బూచి చూపి భయపెడుతున్నారు. దేశానికి వెన్నెముక అని చెప్పిన రైతంటే నేడు ప్రభుత్వానికి లెక్క లేకుండా పోయింది.

*జగదేవిపేట* *బాధితరైతు*

## వినాయకునితో వ్యాపారమా?

విఘ్న రాజాధిపతి వినాయకుడ్ని నెల్లూరులో మొదలింగుకు పెట్టినట్లు జమీన్‌రైతులో వచ్చిన వార్త చూసి ఆశ్చర్యపోయాను. వ్యాపారాలు రకరకాలుగా మారిపోయి వున్నాయి. దేవుడితో వ్యాపారాలు చేస్తున్న రోజులివి. అదే విధంగా ఇదే సంచికలో మహిమగల కాణిపాకం వినాయకుని గూర్చి వ్రాసిన వార్త కూడా బాగుంది.

*జంబూపట్నం* *ఎన్.నాగేశ్వరరావు*

# 50 ఏళ్లక్రితం

3వ పేజీ కొరవ

ప్రమాదం సంభవించ వచ్చుననే భయంతో కారులో ఎక్కి బయలుదేరగా, వెనుక నుంచి ఈలలు వినబడ్డవని, ఒక ఫర్లాంగు దూరం పోకముందే రెండు, మూడు వందల మంది కర్రలతో కారుపైదాడి చేశారు.

రాఘవయ్య కారుపై దౌర్జన్యం జరిగిన విషయం తెలుసుకొని ఆర్డీఓ అక్కడకు చేరుకొని, జీపు పోలీస్ కొరకు బుచ్చి పంపాడని, బుచ్చిలో పోలీస్ లేక, కలిగిరి చెరువు నుండి నెల్లూరుకు ఫోన్ చేశారని తెలుస్తుంది.

### పదివేల ఎకరాల సాగు

ఇప్పుడు పేదూరు, పావిరెడ్డిపాళెం, దువ్వూరు, వావిళ్ల మొదలగు చెరువులు ఎత్తివేసినందువల్ల 3వేల ఎకరాలు సాగు క్రిందకు వచ్చిందని, మరికొన్ని చెరువులు కూడా ఎత్తివేయవలసి వున్నదని, వాటినన్నిటిని పరిశీలించమని తాను ఎగ్జిక్యూటివ్ ఇంజనీయరు గారికి చెప్పానని, అవి గూడా ఒకటి, రెండు సంవత్సరాల్లో ఎత్తివేయుటకు ప్రయత్నిస్తామని, అవి ఎత్తివేస్తే కొత్తగా పదివేల ఎకరాలు సాగు కాగలవని నెల్లూరు కలెక్టర్ బి.జోగప్ప చెప్పారు.

### ముఖ్యవార్తలు

**మద్రాసు ప్రభుత్వం - పన్నులు!**

వచ్చే సంవత్సరం, ఇప్పుడున్న పన్నులు గాక కొత్తవేవి విధించబోమని, శాసనసభలో ఆర్థికమంత్రి గోపాలరెడ్డి గారు తెలిపారు. ఇప్పుడు ఉండే పన్నులు తక్కువనా?

**పశుపక్ష్యాదుల - బలి నిషేధం**

హిందూ దేవాలయాలలో పశువులను, పక్షులను బలి ఇవ్వరాదని నిషేధిస్తూ మద్రాసు శాసనసభలో చట్టం ప్యాసయ్యింది.

### నెల్లూరు ముచ్చట్లు

**కౌమార భృత్యవైద్యశాల**

దీన్ని మనవారు మెటర్నిటి అండ్ చిల్డ్రన్స్ హాస్పిటల్ అని మామూలుగా పిలుస్తారు. అంటే గర్భిణీ మాతా - శిశు చికిత్సాలయం అన్నమాట. ఆయుర్వేద భూషణ, భిషగ్వర, భారతీ తీర్థ యిత్యాది బిరుదాంకితులనే దానికంటే మన ప్రఖ్యాత ఆయుర్వేద నిపుణులు శ్రీమాన్ ఏటూరు శ్రీనివాసాచార్యులు గారు, తన షష్టి పూర్తి మహోత్సవ సందర్భంగా నెల్లూరుటౌన్ హాల్ ఎదుట ఒక కౌమార భృత్య వైద్యశాలను ఈ నెల 14తేది స్థాపన చేశారు. రేబాల లక్ష్మినరసారెడ్డి గారు దీన్ని ప్రారంభించారు. పలువురు పెద్దలు ఇందులో పాల్గొన్నారు.

**రామానంద యోగి**

26సంవత్సరాల యోగి నెల్లూరు నవాబుపేట కంచర్ల వారి తోటలో 22తేది ఉదయం 10 గంటలకు భూగర్భమున యోగసమాధియందు వుందురట. మరల 1తేది ఉదయం 10 గంటలకు బైటకు వత్తురట. అందరూ వచ్చి చూడమని వారి శిష్యులు తెలుపుతున్నారు.

**దొంగరేషన్ కార్డులు**

ఎక్కువ పేర్లు వున్న, అసలు మనుషులే లేకుండా ఈ మాదిరి వుండే దొంగరేషను కార్డులన్నీ మర్యాదగా యీ దినం 22తేది లోపుగా వాపసు చేయండి. లేకుంటే కఠినంగా శిక్షిస్తాము అని నెల్లూరు తాసిల్దారు నారాయణరావు ముందుగా చెబుతున్నాడు. 23, 24 తేదుల్లో తనిఖీకి వస్తారట. అందర్నీ ఇంట్లో వుండమన్నారు.

# నెల్లూరుసంగతులు

4వ పేజీ తొరవ

స్వయాన చీపురు పట్టి బ్లీచింగ్ వేసి మరుగుదొడ్లు కడిగారు. అధికారే స్వయంగా చీపురుపట్టేసరికి సహజంగానే సోంబేరులైన ఇక్కడి సిబ్బందికి ఏమి పాలుపోలేదు. వెనువెంటనే రంగంలోకి దిగి సిబ్బిలు పట్టి చెత్త ఎత్తిపోశారు. గోడల మీద ఎదిగిన తుంపర చెట్లను నరికి శుభ్రం చేశారు. మహిళా ఉద్యోగినులు ప్రతి సెక్షన్ గదిని నీళ్లతో కడిగి ముగ్గులు పెట్టారు. ప్రహరీ గోడలపైని మలిన వ్రాతలను కడిగి సున్నాలు వేశారు. చెత్తను వెలికితీసి రికార్డు రూమును చక్కగా అమర్చారు. సాయంకాలం సమావేశ మందిరంలో సభను నిర్వహించి జిల్లా పచ్చదనం - పరిశుభ్రతలో మొదటి స్థానం పొందేలా అన్ని శాఖల ఉద్యోగులు కష్టించాలని సిఇఓ ఉద్బోధించారు. డిప్యూటీ సి.ఇ.ఓ విశ్వనాథరెడ్డి, ఏ.ఇ.ఓ. రవికుమార్, వాస్తు రామచంద్ర, అమర్, రమేష్, శ్రీనివాస మూర్తి, కె.ఆర్.సి. రెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

## దొంగ అరెస్ట్ - బంగారం స్వాధీనం!

నెల్లూరు టౌన్‌లోని పలు ప్రాంతాల్లో జరిగిన వివిధ దొంగతనం కేసుల్లో నిందితుడైన బి.మోహన్‌రావు అనే పాత నేరస్తుని పోలీసులు పట్టుకొన్నారు. అతని వద్ద నుంచి 32 సవర్ల బంగారు నగలను స్వాధీన పర్చుకొన్నారు. ఈ ముద్దాయి గత సంవత్సరం ఏప్రిల్ నెలలో పట్టణంలో ఎన్.జి.ఓ. కాలనీ, భక్తవత్సల నగర్, జూలై నెలలో ప్రశాంతినగర్, ఆగష్టు నెలలో భక్తవత్సలనగర్, ఎన్టీఓ కాలనీలలో జరిగిన దొంగతనాల్లో ముద్దాయి. ఈ దొంగను అరెస్ట్ చేయడంలో సిసిఎస్ ఎస్ఐ నాగేశ్వరరావు ఆయన సిబ్బంది కష్టపడ్డారు.

## జడ్పీలో జీతాలు ఇవ్వడం లేదు

జిల్లా వైద్య ఆరోగ్య శాఖలో గత 30 సంవత్సరాల నుండి పనిచేస్తున్న 15 మంది సిబ్బందికి జీతభత్యాలు జిల్లా పరిషత్ నిధుల నుంచి చెల్లిస్తుండినారు. కానీ ఒక సంవత్సరం నుంచి జీతాలను సక్రమంగా చెల్లించలేదట. పని చేయిస్తున్నది వైద్య ఆరోగ్య శాఖలో కాబట్టి అక్కడ తీసుకోమంటున్నారని ఎపి. పబ్లిక్ హెల్త్ అండ్ హాస్పిటల్ ఎంప్లాయీస్ యూనియన్ అధ్యక్షుడు జి.వెంకటేశ్వర్లు తెలియజేస్తున్నారు. నాలుగునెలలుగా ఈ సిబ్బందికి అసలే జీతాలు లేవట. జడ్పీ అధికారులు, వైద్య శాఖాధికారులు రెట్టించుకొని మధ్య ఉద్యోగులను బలి పశువులు చేయడం ధర్మం కాదు.

## కె.వి. చలమయ్యకు అవార్డు

హైదరాబాద్‌లోని వాసవి ఆర్ట్స్ థియేటర్స్ వారు ప్రతి సంవత్సరం అందజేసే వాసవి నవరత్న అవార్డును ఈ యేడాది నెల్లూరీయుడు కె.వి. చలమయ్యకు ఇచ్చారు. ఉత్తమ సాంఘిక సేవకుగాను ఈ అవార్డును డాక్టర్ సి. నారాయణరెడ్డి, పొట్టి శ్రీరాములు తెలుగు యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ ఎన్. గోపి చేతుల మీదుగా అందించారు. చలమయ్య ఆర్యవైశ్య మహాసభ రూరల్ డెవలప్‌మెంట్ ఛైర్మన్‌గా పనిచేస్తున్నారు.

## గీతాపఠన పోటీల్లో విజేతలు

నెల్లూరులోని చిన్మయా మిషన్ జిల్లాస్థాయిలో నిర్వహించిన గీతా పఠన పోటీల్లో 134 మంది పాల్గొన్నారు. వీరిలో ఎ గ్రూప్‌లో లక్ష్మిప్రసన్న, ఎస్వీ శార్వాణి; బి గ్రూప్‌లో ఎస్. స్మిత, ఆర్. సుచిత్ర; సి గ్రూప్‌లో బి. ప్రశాంతి, జి. పవన్‌కుమార్ బహుమతులు గెల్చుకున్నారు. విజేతలకు స్వామిని నిర్మలానంద బహుమతులు పంచి పెట్టారు.

# పెద్దాస్పత్రి

4వ పేజీ తొరవ

మత్తు డాక్టర్ వున్నారు. అత్యాధునిక వెంటిలేటర్ సౌకర్యంతోపాటు స్కానింగ్, ఇసిజి, ఎక్స్‌రే, అల్ట్రాసౌండ్ పరీక్షలు చేసే పరికరాలున్నాయి. రక్త, మల, మూత్ర, గళ్ల పరీక్షలు చేసే నిపుణులకు తోడుగా వున్న నర్సింగ్ సిబ్బంది ప్రస్తుతం పనిలేక గోళ్లు గిల్లుకుంటున్నారు. దీనికి కారణం రాను రాను పెద్దాసుపత్రికి వచ్చే రోగులు తగ్గిపోవడమే.

పెద్దాసుపత్రిలో 250 పడకలున్నాయి. ఇవి చాలవన్నట్లు ఇటీవల కోట్లాది రూపాయలు పెట్టి ఆసుపత్రికి అదనపు భవనాలు కట్టారు. వీటిలోని స్పెషల్ రూమ్స్, ఆపరేషన్ థియేటర్లు టౌన్‌లోని ఏ ఇతర ఆసుపత్రులకు కూడా తీసిపోవు. ఆసుపత్రిలో వున్న మందులు చాలకపోతే బయట కొనుగోలు చేయను పడకకు వంద రూపాయల మేర ఖర్చు పెట్టే వసతిని ప్రభుత్వం చేకూర్చి పెట్టింది. అవసరమైన కేసుల్లో రక్తాన్ని కూడా ఉచితంగా ఇస్తారు. నెల్లూరులో వున్న మరొక బ్లెడ్ బ్యాంకులో ఇచ్చిన రక్తానికి బదులు రక్త మిచ్చి 450 రూపాయలు చెల్లిస్తేగాని రక్తమివ్వని పరిస్థితి. ప్రమాద కేసులు వెనువెంటనే చేర్చుకొని విచారణ పేరిట జాగుచేయక వైద్య మందించను వీలుగా పోలీస్ అవుట్ పోస్టును కూడా పెద్దాసుపత్రిలో పెట్టారు. ఎమర్జెన్సీ పరిస్థితుల్లో డాక్టర్లను పిల్చుకొచ్చే అంబులెన్స్‌కు అవసరమైన డీజిల్‌కు ప్రభుత్వం నిధులు విడుదల చేయకపోవడంతో అది మూలన పడింది. స్పెషలిస్టులు సెలవుల్లో వుంటారన్న విమర్శ కూడా వుంది. సిబ్బందిలో లంచాల కోసం పీడించే తత్వం, డాక్టర్ల ఉదాసీనతగా చేస్తున్న వైద్యం పెద్దాసుపత్రిపై నమ్మకం పోయేలా చేస్తుంది. పేద ప్రజలకు సేవ చెయ్యాలన్న సేవాభావం, తీసుకుంటున్న జీతానికి న్యాయం చెయ్యాలన్న ఇంగిత జ్ఞానం ఉంటే తప్ప నెల్లూరు పెద్దాస్పత్రి పేద ప్రజలకు అందుబాటులో ఉండదు. అంత వరకు ఎన్ని వసతులు, వనరులు సమకూర్చినా దాని వల్ల ప్రయోజనం శూన్యం.

# పందికొక్కులు

4వ పేజీ తొరవ

డాక్టర్ సర్వేపల్లి విజయకుమార్, డాక్టర్ పి. కృష్ణారెడ్డి ముఖ్య అతిథులుగా విచ్చేస్తారు. సుప్రసిద్ధ శస్త్ర చికిత్స వైద్య నిపుణులు జె.వి. రామ్మోహన్‌రావు తన జననీ, జనకుల స్మృత్యర్థంగా బాలకృష్ణ ప్రసాద్‌ను సన్మానిస్తారు.

# చిత్రసమీక్ష

9వ పేజీ తొరవ

వేస్తుంటాడు. కళ్యాణ్ ఆమె హృదయంలో కదలకుండా కుదురు కుంటాడు. కళ్యాణ్ ప్రేమ ఫలించాలని, అతని మిత్రుడు రమేష్ పట్టుగా ప్రయత్నిస్తుంటాడు. కళ్యాణ్, శ్రీనివాస్‌లు మేఘమాల మనోసీమలో నాటిన ప్రేమ బీజం, మొలకై, మొక్కై, మానై, పూలుపూచి కాయకాస్తుంది. ఆ ప్రేమ ఫలాన్ని ఎవరికి అందించాలి? తాను ఎవరికి అంకితం కావాలి? ఆమె అంతరంగంలో అనంత అంతర్మథనం. అంతర్లీనంగా ప్రేమారాధనా భావం. "నిన్నే ప్రేమిస్తా"నని ఎవరితో అంటుంది? ఎవరికి ప్రేమహారతి పట్టుంది? ఈ నిర్ణయం చిత్రానికి పతాక సన్నివేశమవుతుంది. కొత్త తరహాలో ఈ పతాక సన్నివేశాన్ని, ప్రేక్షకులకు నచ్చేట్టు, మెచ్చేట్టు ప్రత్యేక పద్ధతిలో తీర్చిదిద్దాడు దర్శకుడు. ఈ నిర్ణయాన్ని చిత్రం చూచి తెలుసుకుంటె బాగుంటుంది.

## చస్తున్నాం

-గ్రిద్దలూరు గోపాలరావు

చస్తున్నాం<br>
ప్రతి రోజూ<br>
పలుమార్లు<br>
చస్తున్నాం

తలకు మించిన<br>
కరెంటు ఛార్జీలు<br>
ఇంటి పన్నులు<br>
కొళాయి ఛార్జీలు

కట్టడం కనాకష్టమై<br>
చస్తున్నాం

మునిసిపల్ కొళాయిల్లో<br>
నీళ్లురాక, త్రాగనీళ్లు లేక<br>
అథవా అఘోరిస్తూ వచ్చినా<br>
మురికినీళ్లు మింగుడు పడక<br>
చస్తున్నాం

అన్నిటి ధరలు<br>
విపరీతంగా పెరిగి<br>
నిత్యావసర వస్తువులు<br>
కూరలు, నారలు<br>
అవసరమైన మందులు<br>
కొనలేక, తినలేక<br>
చస్తున్నాం

ఆహార పదార్థాల్లో<br>
అన్ని రకాల మందుల్లో<br>
మనుషుల మాటల్లో చేతల్లో<br>
స్నేహితంలో, బంధుత్వంలో<br>
కల్తీ, కల్తీ, కల్తీ విష క్రిమితో<br>
చస్తున్నాం

నిఘావేసి కాపుకాసి<br>
పట్టపగలే దోచే దొంగలు<br>
నరహంతక నియంతలా<br>
నిరంతరం పెరిగే కాలుష్యం<br>
జనారణ్యంలో రాజకీయ రొద<br>
బ్రతుకుల వేదిక మీద<br>
మానవతను మట్టుబెట్టే<br>
అవినీతి, అరాచకం<br>
శాసనకర్తల్లా రంకెలు వేసే<br>
పలు సమస్యలతో<br>
ప్రతిరోజూ పలుమార్లు చస్తున్నాం

హైదరాబాద్‌లోని వాసవి ఆర్ట్స్ థియేటరు వారు ఉత్తమ సంఘసేవకు కె.వి. చలమయ్యకు అవార్డును బహూకరిస్తున్న డాక్టర్ సి. నారాయణరెడ్డి, ఆచార్య గోపి.

నాగార్జున, శ్రీకాంత్, రాజేంద్ర ప్రసాద్, సౌందర్యల నటన చిత్రానికి ఆయువు పట్టుగా నిలుస్తుంది. ఎస్.ఎ. రాజ్‌కుమార్ సంగీతంలో "ఒక దేవత వెలిసింది నీ కోసమే, నీ ముంగిట నిలిచింది మధు మాసమే" - అనే పాట హాయిని నింపుకొని అలరిస్తుంది. శ్యాం. కె. నాయుడు కెమెరా పాటల దృశ్యాలను కన్నుల పండువ చేసింది. కె. వెంకటేష్ ఎడిటింగ్ కథ నడకకు నాణ్యత కూర్చింది.

# సినిమా

9వ పేజీ తొరవ

కావాలంటే వచ్చేదికాదు, వద్దంటే మానేది కాదనేది ఇమేజ్ అని హృతిక్ చెబుతున్నాడు.

# పిచ్చితల్లీ

9వ పేజీ తొరవ

కొవ్వొత్తుల మాదిరి ఆర్పితే పొగరాదు. కరిగి ముద్దలు ముద్దలుగా పడదు. ఈ కొవ్వొత్తుల రేటూ ఎక్కువే. రకరకాల పువ్వులు, పళ్లలా అందంగా తయారు చేస్తున్న కొవ్వొత్తులకు మహారాష్ట్రలో మంచి డిమాండ్ వుంది.

# గట్టి దెబ్బ

8వ పేజీ తొరవ

పుస్తకంలో వ్రాయాలంటే ఓటింగ్ నిర్వహించాలని పట్టుపట్టారు. కేవలం తనపై కక్ష సాధించడానికే ఛైర్మన్, కమీషనర్ ప్రయత్నిస్తున్నారని, తాను గత సమావేశాల్లో బ్లీచింగ్ అడ్వాన్సులు, ట్రాక్టర్ల కుంభకోణాలను ప్రస్తావించడమే యిందుకు కారణమన్నారు. సభలో మూజువాణి ఓటింగ్‌కు ఛైర్మన్ ప్రకటించిన సమయంలో 29 మంది కౌన్సిలర్లు సమావేశంలో వున్నారు. ఓటింగ్‌లో 13 మంది దేశం కౌన్సిలర్లు, మరో ఇద్దరు బిజెపి కౌన్సిలర్లు సున్నాకు మద్దతు పలికారు. కాంగ్రెస్ శిబిరంలోని ముగ్గురు కౌన్సిలర్లు కూడా సున్నాకు మద్దతు పలకడంతో, సున్నాకు మెజారిటీ లభించింది. దీనిని మినిట్స్ పుస్తకంలో ఛైర్మన్ చివరకు వ్రాయక తప్పలేదు.

సమావేశంలో ఎమ్మెల్యే వంటేరు వేణుగోపాలరెడ్డి మాట్లాడుతూ మున్సిపాలిటీకి రెండు ట్రాక్టర్లకు నాలుగు లక్షల రూపాయలు, మూడవ లైను విద్యుత్ తీగలు వేసేందుకు మూడు లక్షల రూపాయలు ఎమ్మెల్యే కోటా నుండి మంజూరయినట్లు తెలిపారు. మున్సిపాలిటీ ఆదాయం పెరగడానికి అందరూ కృషి చేయాలని కోరారు.

యానాదిశెట్టి మాట్లాడుతూ తాను ఛైర్మన్‌గా ఎన్నికయి అయిదున్నర నెలలు గడిచినా యింత వరకు ఒక్క పని చేయలేదన్నారు. ఒక్కొక్క వార్డులో 25వేల రూపాయలు వెచ్చించి పనులు చేయడానికి ప్రయత్నం చేస్తున్నట్లు తెలిపారు.

# కట, కట

8వ పేజీ తొరవ

పరిస్థితులను గమనించి కైవల్యా నదికి, కయ్యూరు కాల్వలకు తెలుగుగంగ నీటిని విడుదల చేయాల్సి వుంది.

## రాపూరువాసుల గొంతెండుతుంది

రాపూరు ప్రజలు త్రాగునీటికి పడరాని పాట్లు పడుతున్నారు. చెన్నై మహానగరానికి త్రాగునీరు అందించే కండలేరు డ్యాం రాపూరు మండలంలో వుండగా ఇక్కడి ప్రజలు త్రాగునీటికి కటకట లాడవల్సిన పరిస్థితి నెలకొనివుంది. విపరీతంగా ఎండలు కాస్తుండడంతో ఇక్కడి బావులు ఎండిపోయాయి. బోర్లలో సైతం నీళ్లు రావడం లేదు. పంచాయతీ సురక్షిత మంచి నీటి పథకం ద్వారా ఉదయం 10 నిమిషాలు, సాయంత్రం 20 నిమిషాలు నీళ్లు సరఫరా అవుతున్నాయి. వర్షాలు పడేవరకు రాపూరు ప్రజల దాహార్తి తీర్చను కండలేరు జలాలను తరలించే విషయమై జిల్లా కలెక్టర్ నిర్ణయం తీసుకోవాల్సి వుంది.

## వెంకటగిరిలో దోమల బెడద

వెంకటగిరిలో దోమల బెడద తీవ్రంగా వుంది. పంచాయతీకి పాలకవర్గం లేకపోవడం వల్ల ప్రతి పని అధికారుల దయాదాక్షిణ్యాల మీదే జరగాలి. మురికి కాలువలను శుభ్రపరచి నెలలు గడుస్తుండడం వల్ల అవి దోమల ఉత్పత్తి కేంద్రాలయ్యాయి. దోమల మూలంగా విష జ్వరాలు ఎక్కువయ్యాయి. వెంకటగిరిలో ఎప్పుడో కట్టిన మురుగు కాల్వలను విశాలపర్చి మళ్లీ నిర్మించాల్సిన అవసరం ఎంతైనా వుంది. ఇక్కడ పందుల, దోమల, కోతుల బెడద కూడా జాస్తిగా వుంది. మెదడువాపు వ్యాధిని దృష్టిలో పెట్టుకొని పందులను గ్రామానికి దూరంగా తరమడం తోపాటు కుక్కలు, కోతులను పంచాయతీ పట్టించాల్సి వుంది.

# శ్రద్ధాంజలి

కీ॥ శే॥ పర్వతరెడ్డి బాబుల్ రెడ్డి

"ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితా:
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తేస్తేన ఏవ స:"

"యజ్ఞశిష్టాశిన:సంతో ముచ్యంతే సర్వకిల్బిషై:
భుఞ్జతే త్వఘం పాపాయే పంచత్యాత్మకారణాత్!"

మనిషి తన జీవిత కాలంలో నిరంతర కర్మలచే సదా యజ్ఞాన్ని నిర్వహిస్తూనే ఉంటాడు. అయితే యజ్ఞఫలాల్ని అందించేవాడు మాత్రం ఆ ఈశ్వరుడే!

భగవంతుడే అందించే ఆ ఫలాన్ని సాటి మానవులతో పంచుకొనక తానే అనుభవించువాడు చోర సమానుడని శ్రీకృష్ణ భగవానుని తీర్పు. పరప్రాణికి కొంతైనా త్యాగమొనర్పక తామే భుజించువారు పాపము భుజించినట్లేనని గీతాచార్యుని నిర్ణయం!

గీత గోవిందుని ఈ సందేశాల్ని పూర్తిగా జీర్ణించుకుని ఆచరిస్తూ **స్వర్గీయ శ్రీ పర్వతరెడ్డి బాబుల్ రెడ్డి** గారు ఎల్లప్పుడూ ఎందరికో.... చేయూతగా... సహాయకారిగా... అలంబనగా... ఆప్తునిగా నిలబడి విరాళాల ద్వారా, విద్యా దానాల ద్వారా, ఉద్యోగాల ద్వారా, వైద్య సహాయాల ద్వారా, సమయోచిత సలహాల ద్వారా వారి జీవితాల్లో వెలుగును నింపారు. సుస్థిర మనుగడకు కారకులయ్యారు.

## వారి పుట్టిన రోజు నాడు వారిని...

ఆర్ద్రతతో స్మరించుకునే గుండెలెన్నో!
నిండు కృతజ్ఞతతో అంజలి ఘటించే మనస్సులెన్నో!
వారి దీవెనల కోసం వినమ్రతతో ప్రార్థిస్తున్న చేతులెన్నో

**శ్రీ బాబుల్ రెడ్డి గారి జీవితమే అందరికీ...**
**ఒక ఉదాహరణ... ఒక ఆదర్శం... ఒక స్ఫూర్తి కావాలి.**



## బాబుల్ రెడ్డి ఫౌండేషన్ ఆధ్వర్యంలో

26.09.2000, మంగళవారం : సా 6.30 ని.లకు
హోటల్ వైస్రాయ్, హైదరాబాద్ నందు

**శ్రీ అరుణ్ జైట్లీ**
గౌరవ కేంద్ర న్యాయ - ప్రసార - సమాచార శాఖామాత్యులు

**"ఆర్థిక సంస్కరణలు**
**నూతన శాసన ప్రక్రియ"**

అను అంశంపై ఫౌండేషన్ ప్రసంగం చేసెదరు.

**శ్రీ ఎం.ఎస్. లిబరహాన్**
గౌరవ ప్రధాన న్యాయమూర్తి, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు
సమావేశానికి అధ్యక్షత వహించెదరు.

**అందరూ ఆహ్వానితులే**



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. Ph: 091-861-327354, Offset Printing at Zaminryot Press, Nellore.